ద్వితీయ కుసుమం:-

# ప్రార్థన
—(o)—
# డిటెక్టివ్

(ఏకాంకికలు)



(ప్రార్థన-బెజవాడలో హనుమంతరాయ గ్రంథాలయములోజరిగిన నాటికాపోటీలలో ద్వితీయబహుమానం పొందిననాటిక)

రచన :
డాక్టర్ కొల్లిపాటి గంగాధరరావు
బాపట్ల

1—5—54, వెల రు 1-4-0

ముందుమాటలు:-

మేము ప్రదర్శించటానికే నాటికా నాటకాలు వ్రాయటం ప్రారంభించాను. క్రొత్త నాటికలకోసం యితర ప్రాంతాల స్నేహితులు వెతుకుతూ, వారే నన్నొకణ్ణి కనుకున్నారు. వ్రాతప్రతి తయారయీ అవకుండానే చాల రచనల నెత్తుకుపోతున్నారు. వకటి రెండింటికి పేరుకూడా వారే పెట్టుకున్నారు. ప్రదర్శించటంలో నాకున్న కుతూహలం ప్రచురించటంలో లేకపోయినందువల్ల రెండేళ్ళుగా ప్రచురించే వుద్దేశ్యం కలగలేదు. పత్రికలకుకూడా పంపలేదు. కాని స్నేహితులైన ఎమెచ్యూర్ నాటికా సంస్థలకు వ్రాతప్రతులందీయలేక, విసిగి చివరకి అచ్చువేయించదలిచాను. ప్రథమంగా తెలుగుకోపం బంగారు సంకెళ్ళు అచ్చయింది. తెలుగుకోపం నా ప్రథమనాటిక బంగారు సంకెళ్ళు అప్పటికి చివరిది.

ఇవీ, యిక ముందువీకూడా ఏ మార్పులూ అక్కరలేకుండా ప్రదర్శనానికి వీలుగా వుంటాయి. కాని యీ పుస్తకంలో ప్రార్థన చాలా శ్రమ, వ్యయంతోగాని ప్రదర్శించలేరు. చాలా Technical assistense కావాలి. వాటి వివరాలు నాటిక చివర వ్రాశాను.

'డిటెక్టివ్' అమెచ్యూర్ సంస్థకు అనుకూలమైన నాటిక తెలుగుకోపం, మొదలైన వాటిలాగే ఏ సీలితెరముందైనా ప్రదర్శించవచ్చు. డిటెక్టివ్‌లో, రామం, రంగనాథం పాత్రలు కూడా తెలుగుకోపంలోవే. రామం, రంగనాథం మనస్తత్వాలూ అవే. ఇవి హాస్యనాటికలవటంలో రామం, రంగ

నాథం పాత్రధారులు చాలా చోట్ల Buffoon లుగా తయారవుతున్నారట. కాని వాళ్ళ అభినయం, అహార్యం వాచకం కూడా మామూలు విద్యార్థుల్లాగానే వుండాలి. సినిమా హాస్యనటకుల కోతినటనలను అనుకరించవద్దు. అది స్ఫురించనీయవద్దు. ఏ మాత్రం స్ఫురింపచేసినా ఆ సినిమాపాత్రధారి ప్రేక్షకులకు జ్ఞాపకం వస్తాడు కాని మీ వ్యక్తిత్వంతో మీరు జ్ఞాపకంరారు. చిత్రాలు వ్రాసియిచ్చి ముద్రణలో నాకెంతో చేదోడు వాదోడుగావున్న P. S. తిలక్‌కు నా ముద్రణావ్యవసాయానికి తోడ్పడుతున్న అందరు మిత్రులకూ నా కృతజ్ఞతాభివందనాలు.

గంగాధరరావ్.

---

బాపట్ల కల్చరల్ క్లబ్ వారిచే అన్ని effcts తో ప్రథమ పర్యాయం ప్రదర్శించబడింది.

నటవర్గం:- గంగాధరరావు, శ్యామసుందర్. రాధాకృష్ణమూర్తి తిలక్, D. V. కృష్ణమూర్తి, శ్రీమతి కోమలి.

రాజమండ్రి రాఘువకళాసమితివారిచే సర్వాంగసుందరముగా ప్రదర్శింపడుతున్నది.

నటవర్గం:- Dr. G. రాజారావ్, మేడూరి వీరవెంకన్న నాగేంద్రాజీ, అంకరాజు శంకరరావు, శ్రీమతి శాంతగార్లు.

# ప్రార్థన



పాత్రలు:-

1) మొదటి సైనికుడు } పారిపోయి యింటికి వస్తున్న యిద్దరు
2) రెండవ సైనికుడు } సైనికులు. పడుచువాళ్ళు

మొదటి సైనికుని చేతిలో వక gun. మాసిన యూనిఫారం

3) ముసలివాడు:- 75 ఏళ్ళవాడు. పొడుగైన, నెరసిన గడ్డం; జుట్టు; పాత మిలిటరీ పొడుగు కోటు. చేతిలో వక లాంతరు

4) ముసలి:- ఒక Spirit. తెల్లని పొడుగైన జుట్టు. గుండ్రని ప్రశాంతమైన మొహం. Saint పొడుగు గౌను.

5) వ్యక్తి:- స్త్రీ. విరబోసిన జుట్టు. మొదటిసారి ప్రవేశించినప్పుడు నల్లని గౌను. పై ముసుగు రెండవసారి ప్రవేశించినప్పుడు తెల్లని చార్జెట్ పై ముసుగు. మొదటిసారి ప్రవేశించేటప్పుడు చేతిలో వక Dummy baby

రంగాలంకరణ ప్రత్యేకంగా వర్ణించబడింది. అవిగాక కావల్సిన యితర సామగ్రులు:- 1) తుపాకీ 2) చేలాంతరు. Dummy baby. తవ్వే పరికరాలు: (Pick axe) Aeroplane record పేలుడు సామగ్రి magic lantern slides పావురం బొమ్మ, ఎర్రరంగు.



# శ్రీ పిల్లుట్ల సచ్చిదానంద తిలక్
# దంపతులకు

ఈ 'కృతి ని'

ప్రేమ పురస్సరముగా

అంకితమిస్తున్నాను.

గంగాధరరావు.

# ప్రార్థన

[ద్వితీయ ప్రపంచ సంగ్రామపు అంతిమ దినాలు. సంగ్రామం జరుగుతున్నది ఒక దేశపు ఒక కుగ్రామం పొలిమేరలో, చీకటిరోజుల్లో, ఒక రాత్రివేళ, ఇద్దరు సైనికులు దోవవెతుక్కుంటూ ప్రవేశించారు. ఆ చీకట్లో ముందు ఏముందో, వెనక ఏముందో తెలియటంలేదు. కాసేపటికి—]

మొదటి సైనికుడు :— (పెద్దగా నవ్వుతూ) హై హో! Soldier చూశావా? కనబడేదే మనవూరు. యుద్ధమేఘాలు ప్రపంచాన్నంతా కమ్మేసినట్లే, Black out మనవూరిని కమ్మేసింది. క్రిమ్మేసిన గాఢాంధకారాన్ని చీల్చుకొని బయటపడి కనిపిస్తోంది దూరాన – వీధి దీపాలకాంతి... అమ్మయ్యా... ఎడ తెగకుండా నడిచి, నడిచి, చివరికి మనవూరు చేరుకున్నాం.

రెండవ సైనికుడు :— చేరుకున్నాం ఎట్లాగయితేం. ఓ! తిరిగి మన వూరు చూస్తుంటే నాహృదయం పొంగిపోతోంది... ఏవో పూర్వ స్మృతులన్నీ జ్ఞాపకంవచ్చి. పరిచితమైన స్పర్శల్ల కాబోలు, పాదాలు వుబ్బి తబ్బిబ్బవుతున్నాయి. చిన్ననాడు మనం ఆడుకున్నదే కాబోలు యీ నేల.

మొదటి:— ఆ. ఈనేల, ఆకొండ, ప్రతి అంగుళం, మనంతోక్కి— గంతులేసిందే.

రెండవ:— విసుకుగా ఆ కొండవాలులో పరుగెత్తటం, ఆనాటి ఒక పల్లిజ్ఞావిశేషం. జ్ఞాపకముందా?... ఒకనాడు నేను పడ్డాను. ... పరుగెత్తుతూ. నువ్వు నవ్వేవు.

మొదటి:— ఆవేళ నిన్నుచూసి నేను నవ్వేను. యివాళ మనల్ని చూశి అలాగే నవ్వుతారు అందరూ.

రెండవ:— ఎవరు?

మొదటి:— మనవూరి వాళ్ళంతా ...... మనిద్దర్నీ చూసి.

రెండవ:— మనిద్దర్నీ చూసి...... నవ్వుతారు ... అవును.

మొదటి:— అర్థమయిందా? ఎందుకు నవ్వుతారో?

రెండవ:— అర్థమయింది ...ఆఁ... సిగ్గువేస్తుందికూడా.

మొదటి:— సిగ్గువేసి లాభం ఏమిటి ... పద ... పోదాం ... (ముందుకుపోయి, రెండో సైనికుడు కదలక పోవడం చూసి) ఏం? ఆగావ్?

రెండవ:— అడుగుముందుకు వెయ్య బుద్ధిపుట్టడంలేదు.

మొదటి:— అందుకని ఇక్కడే వుండిపోదామా?

రెండవ:— ఆఁ. ఇక్కడే ఆగిపోతే మంచిదిలావుంది.

మొదటి:— ఇక్కడా! మనంవున్నది ఎక్కడో గుర్తుపట్టావా?

రెండవ:— ఎక్కడ?

మొదటి:— ఊరివెలుపల, కొండపక్క, ఏముందో గుర్తులేదూ?

రెండవ:— వుంది...స్మశానం...

మొదటి:— అక్కడేమనంవుంది...

రెండవ:— స్మశానంలో మనంవున్నాం...ఇక్కడేవుండిపోదాం

మొదటి:- ఇక్కడా?

రెండవ:- అవును...ఇక్కడే! సైనికుడు యుద్ధంలో చచ్చినా ...స్మశానం చావేగా...బ్రతికీస్మశానంలో నేవుందాం

మొదటి:- యుద్ధంలోచచ్చి స్మశానంలోవుంటే బాగుంటుంది కాని...యుద్ధంలోంచి పారిపోయొచ్చి, స్మశానంలో వుంటే ఏంబాగుంటుంది?

రెండవ:- బ్రతికి, వూళ్ళో తలెత్తుకు తిరగ లేనప్పుడు, స్మశానంలోనే నశించిపోవటం బాగుండదూ?

మొదటి:- బాగుంటుందేమో, కాని. నశించడం నాచేత కాదు. నేను ఇవాళ ఓడి పారిపోయివచ్చాను. కాని కంఠంలో వూపిరివుండగా శత్రువుకు తలవంచను. నా రెక్కల్లో జవసత్వాలు చలనంతో వున్నంతవరకు వీరవిహారం చేస్తాను. ఆఖరి క్షణంవరకూ దెబ్బలాడతాను.

రెండవ:- (మాట్లాడడు)

మొదటి:- చూడు...చూడు...ఇవిగో...గోరీలు... గోరీలు ...క్రిందటియుద్ధంలో మనకోసం...నీకోసం ... నాకోసం చచ్చిన మన తాతలు... ముత్తాతలు. తండ్రులు... దేశంకోసం ప్రాణాలొదలిన ధన్యులు. మన వూరివారందరూ చిరకాలంస్మరించుకునే ధన్యజీవులు ఈగోరీ ఎవరిదో జ్ఞాపకంఉందా?...వళ్ళుతూట్లుపడినా చేతిలోతుపాకీ వదలని మన పోడుగు తాతయ్యది. (మరోప్రక్క చూపిస్తూ పరుగెత్తి)...యీగోరీఎరగవ్? ఈ ముసలాడి సాహసకృత్యాలు వింటుంటే మన

హృదయాల్లో గర్వం పొంగిపొరలేది. వీళ్ళిద్దరూ మన వూరికేకాదు, మన దేశానికే గౌరవం సంపాదించి పెట్టారు... అనేవాళ్ళంతా. ❦

రెండవ:- మన తాతలూ, తండ్రులు, దేశానికంత గౌరవం సంపాదించిపెడితే మనం సిగ్గు... అవమానం ... అపకీర్తి ఇంటికి మోసుకువచ్చాం. చూడు... ఆవీధి దీపాలు మన్ని చూసి దుఃఖిస్తూ తలలు వంచుకున్నాయి.

[దూరాన్నుంచి విమానాలు దగ్గరకు వస్తున్నట్లు శబ్ద వినిపిస్తుంది]

మొదటి:- ఏమిటది?

రెండవ:- విమానాలు!

మొదటి:- మనవెనకే వెతుక్కుంటూ వచ్చాయి!

రెండవ:- పారిపోయివచ్చిన మనమీద కసితీర్చుకోవటానికి వచ్చాయి

[విమానాలు రెండో పక్కకి వెళ్ళిపోయాయి. సైనికులిద్దరూ వాటివంకే చూస్తూ తలలు రెండోపక్కకి తిప్పుతారు]

రెండవ:- వూరిమీదకు వెళుతున్నాయి.

మొదటి:- ఇద్దరు పిరికివాళ్ళకోసం వూరినంతటినీ Bomb చేస్తారు.

---

❦ ఈగుర్తువున్నచోట నాటికా నిర్వాహకులకు Foot notes లో కొన్ని Directions యివ్వబడతాయి. ఇక్కడ Aeroplane sound రాబోతుంది కనక ప్రాంప్టర్ జాగ్రత్త పడాలి. గుర్తుచూడగానే Technical assistants కు Warning యివ్వాలి ఇక్కడ విమానాల రికార్డు వెయ్యాలి

రెండవ:- తరిమిపట్టు కోవటం చేతకాక తేలికపద్ధతికి తయారయ్యారు.

మొదటి:- మనవూరికి మనంచేసిన ఉపకారం ఇదే. మన్ని చూసి మన్నే Bomb చేసి, తిరిగిపోతే ఎంత బాగుండును.

[దూరాన Bomb లు వేసిన శబ్దం]



రెండవ:- ఊరిమీద బాంబులు వేస్తున్నారు.........

మొదటి:- (కాసేపాగి) తిరిగి వస్తున్నాయ్ ... ఇంకా బాంబులు వేస్తున్నారు. ... పో ... దాక్కో ... (రెండోవాణ్ణి పక్కకుతోసి తను రెండోపక్కకు పోతాడు)

(బాంబుపేలుడు దగ్గరగా... ఇంకాదగ్గరగా... మరీ దగ్గరగా వినిపిస్తుంది. విమానాలరొద మరీఎక్కువైంది ... ఒక పెద్ద మెరుపు... పేలినమోత... అంతా చీకటైపోయింది... అంతా పొగ ... విమానాలరొద క్రమేపి తగ్గిపోయింది.) (మొదటి సైనికుడు నెమ్మదిగా లేచి కనిపిస్తాడు)...

మొదటి:- (...వళ్ళుదులుపుకుంటూ లేచి) ఎక్కడున్నావోయ్ నేస్తం...బయటికిరా...విమానాలు వెళ్ళిపోయాయిలే ... ఇక బయటికిరావచ్చు ... రా ... రావేం! ...

---

Lights off. విమానాల మోత, బాంబులశబ్దం. మెరుపు. పొగ 2వ సైనికుని భుజం నెత్తురుతో తడపటం. సమాధులు విరగటం విమానాల రొద ఆగటం. 2వ, చంద్రుడుతో ON lights

ఎక్కడున్నావ్? ... [వెనకనున్న గోరీల వెనక వెతికి తెల్లబోయి నుంచుంటాడు] ... దెబ్బతగిలిందా? ...
(గోరీల వెనకనుంచి స్నేహితుణ్ణిముందుకు లాగుతాడు.) ...
గూడుసలిగిపోయింది ... రక్తం బాగా కారుతోందే!!
(కంగారుపడుతూ) తొందరగా వూళ్ళోకి తీసికెళతాపట్టు
రెండవ:- ఎందుకు? (హీనస్వరంతో ... బాధతో ... మాట్లాడతాడు)
మొదటి:- Hospital ల్లో చేరుస్తా.
రెండవ:- ఇంకా నేను బ్రతుకుతాననే ఆశవుందా?
మొదటి:- ప్రియత్నిద్దాం.
రెండవ:- ప్రియత్నాలేంలాభంలేదు. విరిగిన ఎముకలు గుచ్చుకుని బాధ పెడుతున్నాయ్ ... కళ్ళు చీకట్లు కమ్ముతున్నాయ్.
మొదటి:- ఉండు. నేనుమోసుకుపోతా ... రా.
రెండవ:- వద్దు. నీచెయ్యితగిలితేనే బాధ ఎక్కువవుతోంది. వద్దు. నువ్వెళ్ళిపో... నన్నొదిలేసి వెళ్ళిపో ... (కాసేపాగి) ఎందుకు అనుమానిస్తావ్?
మొదటి:- ఊహు. వెళ్ళను, ఎట్లా వెళ్ళమంటావ్?
రెండవ:- జీవన్మరణాల సంధిలో వున్ననన్ను వదిలేసివెళ్ళక ... మరేంచెయ్యగలవ్.
మొదటి:- చేసేదేంలేకపోయినా, స్నేహధర్మం నన్నికక్కడ కట్టిపడేస్తోంది.
రెండవ:- ఏదైనా .. నువ్వునాతోరాలేవుగా!... అబ్బా ... బాధ ...

మొదటి:— అధైర్యపడకు ... వూళ్ళోకి తీసుకెళతా ...రా...

రెండవ:— లాభంలేదు... దోవలోనే ... ప్రాణంపోతుంది — — ఆ — — నువ్వునాకో ఆ ప్తమిత్రుడివికదూ!

మొదటి:— ఏం! ... ఏం!

రెండవ:— ఒక్క సహాయం ... కావాలి ... చెయ్యగలవ్?

మొదటి:— తప్పకుండాచేస్తాను.

రెండవ:— నీతుపాకిలో వకతూటా మిగిలిందికదూ.

మొదటి:— మిగిలింది...

రెండవ:— దాంతోనన్ను పేల్చేసి .... నీదోవన నువ్వుపో.

మొదటి:— ఇదా .... సహాయం.

రెండవ:— అదే .... అంతకంటే వేరేంకావాలి. సుఖమరణం మంచిదికదూ — యీబలవన్మరణం కంటే.

మొదటి:— అహః! వల్లకాదు.

రెండవ:— ఆహ. ఈ బాధపడలేను.

మొదటి:— నాచేతుల్తో చెయ్యలేనిపని.

రెండవ:— నన్నుత్వరగా వదిలించు.

మొదటి:— కానీ... నాస్నేహితుణ్ణి...నిన్నే...ఆహాహః

రెండవ:—నీశతృవుని సహించంపి వదిలేశావా ఎప్పుడైనా...?

మొదటి:— మరినువ్వు......?

రెండవ:— ఒక్కగుండుతో చచ్చేవాడిమీద పదిగుళ్ళు పేలుస్తావెందుకు?

మొదటి:— (మాట్లాడడు)

రెండవ:— అనుమానరహితంగా చావటానికి...కాదూ!

మొదటి:— ఐతే?......

రెండవ:— వాడికంత ఉపకారంచేసి— అదే వుపకారంనాకు చెయ్యడానికి సందేహిస్తావేం?

మొదటి:— నువ్వునాస్నేహితుడివి.

రెండవ:— స్నేహితుణ్ణిఅవటమేగా, నేనుచేసుకున్న పాపం— నీకుదణ్ణంపెడతాను. యీబాధ భరించలేక అడుగుతున్నాను ... ఈ ఉపకారంచెయ్యి.

మొదటి:— కాని...

రెండవ:— నీస్నేహితుడుఇలా బాధపడటం నీకిష్టమా—నే బ్రితుకుతానని ఆశనీకేమైనావుందా?

మొదటి:— లేనిమాట...నిజమే...

రెండవ:— ఐతే ఎందుకీ అనుమానం. స్నేహితుడు శత్రువు పాటివాడుకాడా? నీ శత్రువునైతే బాగుండేది కదూ...నేను.



మొదటి:— ఓ! (దుఃఖంతో వివశుడౌతాడు)

రెండవ:— పేల్చెయ్ నన్ను ...చెయ్యెత్తి దణ్ణంపెడతాను ... ఈబాధనుండి తప్పించు.

మొదటి:— ఆఁ... ఆఁ. నీస్నేహితుణ్ణి ... స్నేహితుణ్ణిచంపే స్నేహితుణ్ణి ... ఈచేతుల్తోనే ఆ పనిముగిస్తాను... ప్రపంచం ఆతర్వాతనన్ను నిందించనీ... ఏమైనాగానీ.

రెండవ:—ఆ. ఆ. త్వరగాకానీ...ప్రతిక్షణం ఒకయుగంగావుంది. పేల్చేయ్. నీఆఖరి తూటాను సార్థకంచెయ్యి. ... ... ఇంకా ఆలస్యం చేస్తావేం...కానీ ...

---

 తుపాకి శబ్దం. రాబోతున్నది

మొదటి:- నేను సిద్ధమే ... కానీ ....

రెండవ:- ఐతేకానియ్యి...త్వరగా...త్వరగా...కానియ్యి...
(పేలింది) అహాహా... బాగుంది చాలాబాగుంది...
నీఉపకారం నేమరచిపోలేను. ప్రాణంపదుల్తూ చాలా
సంతోషించానని .... మావాళ్ళందరితోనూ ....
మానాన్నతోనూ ... మానాన్నతోనూ ... చెప్పు
...నిజమైన స్నేహితుడంటేనువ్వే... వెళ్ళిపో ...
నాన్నతోచెప్పు ... పో ... నాదోవనాది ...
నీ...దోవ... నీది... పో ... (మరణించాడు)
[మొదటి సైనికుడికి కళ్ళవెంట నీళ్ళు తిరిగినై. కానే
పాగి కళేబరాన్ని గోరీలవెనక్కి కనబడకుండాలాగి,
తనతుపాకీ అవతలపారేసి, రెండోవైపుకి బయలు
దేరాడు. కాని ... అప్పటికే ఒకముసలివాడు లాంత
రుతోవచ్చి రెండవవైపునవున్న ఒక గోరీదగ్గర ఆగి
వున్నాడు. మొదటి సైనికుడు అతన్ని చూసి వెనక్కి
వెళ్ళి అతనివంకే చూస్తున్నాడు. ముసలివాడు ఆ
గోరీని పరీక్షగాకొంతసేపు చూచి:-]

ముసలివాడు:- అంతాబాగానేవుంది ... ఏమీ పగిలిపోలేదు
... అంతా సరిగానేవుంది... ఓభగవంతుడా! భూమి
మీాద బ్రతికినన్నాళ్లూ, ప్రతిజీవినీ బాధపెట్టున్న యీ
భౌతికశక్తుల్ని, యీగోరీలమీాదకూడా తరమకు.
ఇవేనా ప్రణామాలు. [ముందుకువస్తాడు. మొదటి
సైనికుణ్ణిచూసి ఆగి] ఎవరునువ్వు?

మొదటి:- నువ్వెవరు?

ముసలి:- నేనా! కనబడటంలా? ఒకముసలివాణ్ణి - నువ్వా?
మొదటి:- నేను ఒకపడుచువాణ్ణి - నాదీ యీవూరే...
ముసలి:- అబద్ధం!
మొదటి:- అహాఁ. నిజమే,
ముసలి:- అబద్ధం. పచ్చిఅబద్ధం. నువ్వీవూరివాడివికావు.
మొదటి:- ఏం? అలాఅన్నావ్?
ముసలి:- ఈవూళ్లో పడుచువాళ్ళెవరూ లేరు. 16 ఏళ్ళు దాటిన వాళ్ళంతా యుద్ధానికి వెళ్ళారు
మొదటి:- నేను యుద్ధంనుంచే తిరిగి వస్తున్నా.
ముసలి:- పారిపోయి వస్తున్నావా?
మొదటి:- యుద్ధఖైదీల శిబిరాలలోనుంచి- తప్పించుకొని-
ముసలి:- ఎలా తప్పించుకొన్నావ్?
మొదటి:- చీకట్లో పహరావాళ్ళమీద పడి చంపేశాంవాళ్ళ తుపాకులే తీసుకు బయలుదేరాం. కొంతదూరం వాళ్లు మమ్మల్ని తరుముకువచ్చారు. మేం దొరకలేదు.
ముసలి:- ఆగు. అయితే నీమొహం సరిగాచూడనీ... కంఠం విన్నదిలాగేవుంది (ముసలివాడు లాంతరు మొహంమీదకు యెత్తుతాడు. కాని సైనికుడే ముసలివాణ్ణిముందు గుర్తించి తల తిప్పేసుకుంటాడు) ఏమిటి, నువ్వా!
మొదటి:- ఆ!! నేనేతాతా,
ముసలి:- చాలామారిపోయావ్ ... చిక్కిపోయావ్. అవును. అడగటం మొందఃకు తే!

మొదటి:- నువ్వూ బాగా మారిపోయావ్.
ముసలి:- అవును మారేను. అందరూ మారుతారు - కాలం గడచినకొద్దీ.
మొదటి:- అయిదేళ్ళయింది నిన్ను చూశి.
ముసలి:- అయిదా? అయిదేనా! (లెక్కెట్టుకొని) అవును. ఐదే. నేనింకా యెక్కువను కొంటున్నా ...ఐదే... కాని చాలా నెమ్మదిగా గడిచాయి కదూ, యీవేళ్ళు పదపోదాం రా- వూళ్ళోకి. (తను వెళ్ళబోతాడు)
మొదటి:- వూళ్ళోకి రావటానికి మనసొప్పకే ఇక్కడ ఆగాను
ముసలి:- ఏం?
మొదటి:- ఏం చెప్పను? ... యుద్ధానికివెళ్ళి వెనక్కివచ్చాడని నలుగురూ నన్నుచూసి నవ్వుతారు. చూడు; ఆ వీధి దీపాలు నన్నుచూసి మొహం మాడ్చుకొంటున్నై ఇదే గెల్చివస్తే, ఎన్నిదీపావళులు మిరుమిట్లుగొల్పుతూ స్వాగతం యిచ్చేవి!
ముసలి:- పారిపోయి వచ్చినందుకు సిగ్గుపడుతున్నావా?
మొదటి:- ఆ (తలవంచుకుంటాడు)
ముసలి:- మరే! గెల్చివస్తే- మనవూరికీ- మనమనసుకీ బాగానే వుంటుంది. కాని, గెలుపు నీచేతిలోవుందా?
మొదటి;- లేదనుకో ...కాని...
ముసలి:- గెల్చినా అదినీవక్కడిగెల్పా?
మొదటి:- అందరి సైనికుల్దీ-
ముసలి:- అయితే, ఈ అవమానమూ, అందరి సైనికుల్దీనూ

మొదటి:- కాని- అందరూ ఇంకా పోరాడు తున్నారు.

ముసలి:- ఆ. ఆ. పోరాడుతూనే వుంటారు. తరతరాలుగా పోరాడుతూనే వున్నారు... దశాబ్దాలు ... శతాబ్దాలుగా పోరాడుతూనే వుంటారు. పోరాటంలో గెలుపా ... ఓటమా .. అనే. ఆలోచన లేకుండా పోరాడుతూనే వుంటారు. సైనికుడివంతు పోరాడటం మాత్రమే. గెలుపూ ఓటమీ ఒక్కడివే. అవి యుద్ధం ప్రారంభించిన వాడెవడో- వాడివి.

మొదటి:- అదేమిటి. గెలుపూ, ఓటమీ - నావి - నా దేశానివీను.

ముసలి:- నాదేశం ఏమిటి? నీదేశం ఏమిటి? ఆదేశపు ఒక సైనికుడితో ఈదేశపు వక సైనికుడు యుద్ధంలో తల పడ్డాడు ... ఇద్దరూ తుపాకులు పేల్చుకున్నారు. విధివశాన ఒకడికి గుండుతగిలి, చచ్చాడు. రెండో వాడుగెల్చాడు. వాళ్ళవాళ్ళెవరో ఒక వందమంది మిగిత్తే వాళ్ల దేశం గెల్చింది. అంతేగా?— కాని గెల్చినవాడేం బావుకున్నాడు? వాడు గెల్చినా వాడి పక్షం ఎక్కువచస్తే వాడిగెలుపుకేంవిలువ? గెల్పు... ఓటములు సైనికుడివికావు— మీ సైనికులందరూ 'పావులు' 'గుర్రాలు' 'ఏనుగులూ'. మీ అందరి వెనుక ఎత్తులువేసే అజ్ఞాతహస్తంవుంది. గెల్పు ఓటములు, ఆ అజ్ఞాత హస్తానివి.

మొదటి:- ఆ అజ్ఞాతహస్తం నా నాయకుడు. నాదేశానికి నాయకుడు, నేనూ, నా నాయకుడూ, నా దేశంకోసం

పోరాడుతున్నాం.

ముసలి:- అందరూ తమదేశంకోసమే పోరాడు తున్నా మంటారు. అందరూ దేశభక్తితోనే యుద్ధాలుచేస్తారు

మొదటి:- అదేమిటి? అట్లాగంటావ్

ముసలి:- నేను నాజన్మలో రెండు ప్రపంచ సంగ్రామాలు చూశాను. మొదటి సంగ్రామంలో నా పెద్దకొడుకును బలిపెట్టి ఇక్కడ గోరీకట్టాను (తను మొదట వచ్చి పరీక్ష చేసిన గోరీనిచూపిస్తాడు) ... రెండోకొడుకును యీయుద్ధానికి పంపాను. పెద్దవాడు నాకూ నా దేశానికి ఒరగబెట్టిందేంలేదు. ఇక యీచిన్నవాడేం ఒరగబెడ తాడో ఇంకా తెలీదు ... చూద్దాం ... కానీ ... ఇంటికి ... పోదాంపద ... (వెనక్కు తిరిగినడుస్తాడు రెండోవైపుకి)

మొదటి:- నేనురాలేను.

ముసలి:- రాక ఇక్కడేం చేస్తాంవ్?... యీ గోరీల్లో అసంతృప్తితో చచ్చి అణగి పడివున్న పిశాచాల్తో పోట్లాడతావా? ...మరణానంతరం అవ్వి కాస్త సుఖ జీవనం చేస్తున్నై. వాటిని లేవగొట్టకు.

మొదటి:- నాకేదో భయంగావుంది. ... ఆందోళనగావుంది.

ముసలి:- ఉంటుంది మొదట్లో ... కాని యింటికిపోయి భార్యనీ ... పిల్లల్నీచూస్తే సర్దుకుంటుంది. ... ఆఁ... నీభార్య... (ఏదో అనబోయి-ఆగి) ఇంటికి పోతు న్నాంగా...రా...పిల్లలుకులాసాయే ...బాగా అల్లరి చేస్తున్నారు...మీ వాడు నన్ను తాతా...తాతా...

అంటూ వదిలిపెట్టడు. నా నెత్తినెక్కి కూర్చుంటాడు.

మొదటి:- మావాడా...?

ముసలి:- ఆ... మహాకబుర్లు చెబుతాడు.

మొదటి:- కబుర్లా ...

ముసలి:- ఒక్క కబుర్లేమిటి...ఆటలూ ... పాటలూ ... మొన్న, ఐదో ఏడు రాగానే, బళ్లో వేశాం.

మొదటి:- (ఆశ్చర్యంతో) అయిదేళ్ళే !!

ముసలి:- ఆ!...

మొదటి:- (గుర్తుకు తెచ్చుకుని) అవును 5ఏళ్ళు... అవును. కాని నామనస్సులో యింకా 6 నెలల పిల్లాడుగా మెదులుతున్నాడు- ఇప్పుడు పెరిగివుంటాడు.

ముసలి:- బాగా పెరిగాడు. మరి పదిపదకొండేళ్ళు వెళ్తే వాడూ యుద్ధానికి బయలుదేర్తాడు.

మొదటి:- ... తర్వాత ఇక్కడో ... ఇలాంటి మరో శ్మశానంలోనో వుంటాడు.

ముసలి:- ఛ...ఛ... యువకుడివి, సైనికుడివి - అలా ఎందు కనుకోవాలి?

మొదటి:- (విచారంగా) కాని—నాకదే కనిపిస్తోంది.

ముసలి:- అలా అయిపోయావేం... నాకు తెల్సు ... నాకు తెలుసు ... కొడుకుగోరీలో వుండటమంటే నాకు ... తెలుసు... 20 ఏళ్ళ కిందట నా పెద్దకొడుకును యీగోరీలో పెట్టాను. భూమాత ఎప్పుడో వాణ్ణి జీర్ణం చేసేసుకుంది. కానీ నాకు వాడింకా యీగోరీలో వున్నాడనే అనిపిస్తుంది.

నటి:- తాతా ... నీకొకటి చెప్పాలి ... కానీ...

లి:- కానీ .. గీనీ ... ఎందుకు ... తర్వాత చెబుదువు గాని ... ఇంటికిపోదాంరా ... ఐదేళ్ళ కిత్రం చూశావ్ పెరిగిన పసికందును కళ్ళారా ... చూసుకుందువుగానిరా...

నటి:- రాను. రాలేను ... ఇక్కణ్ణుంచి కదిలిరాలేను.

లి:- ఇంకా తలను వంచిన అవమానభారం తగ్గలేదా?

దటి:- కాదు ...

లి:-మరి?

దటి:- నేనేదో యిక్కడ పోగొట్టుకున్నా.

లి:- రేపువచ్చి వెతుక్కోవచ్చుగా ... రా.

దటి:- కానీ ... నాకది దొరకదింక. ఎంత వెతికినా దొరకదు.

లి:- ఏదైనా- నీకన్నకొడుకును, 5 ఏళ్ళతర్వాత చూడడానికంటె అమూల్యమైందా? పద ... నీకన్న కొడుకును కళ్ళారా చూసుకుందువుగాని - నావక్కకొడుకును గురించి చెవులారా చెబుదువుగాని-

దటి:- ఓ. (వివశుడై) ... ఎల్లాచెప్పగలను.

సలి:- ఏడుస్తున్నావా... అంతముఖ్యమైందా... ఆవస్తువు. ఏమిటది. ఎలావుంటుంది ... దీపం వుందిగా - వెదుకుదాంరా!

దటి:- వద్దు ... వెదకవద్దు.

సలి:- ఏం ...

మొదటి:— వెదికితే దొరికేదికాదు.

ముసలి:— మరేమిటి?

మొదటి:— అది— .. — —నాస్నేహితుడిప్రాణం.

ముసలి:— ఆఁ!

మొదటి:— నేనూ, నాస్నేహితుడూ శత్రువులనుండి తప్పించుకొని యిక్కడిదాకావచ్చాం. మమ్మల్ని వెంబడించి పట్టుకోలేక, వెనకనే విమానాల్ని పంపారు.

ముసలి:— ఆఁ... ఆఁ... ఆవిమానాలు బాంబులువేసుకుంటూ యిటునుంచేవచ్చాయి. ఈగోరీమీదకూడా బాంబులు పడ్డాయేమోనని చూసుకోవటాని‌కి నేనువచ్చేశాను.

మొదటి:— తాతా...

ముసలి:— ... కానీ ... గోరీ ఏందెబ్బతినలేదు.

మొదటి:— నాతో వచ్చిన — యీ ... చిన్నవాడికి దెబ్బ తగిలింది...

ముసలి:— పాపం చిన్నవాడేనా! ... ఎన్నేళ్ళుంటాయ్?

మొదటి:— 23 ఏళ్ళు.

ముసలి:— అంతేనా! పాపం ... బాగాగాయాలు తగిలాయా?

మొదటి:— ఈపక్క భుజం ... పక్క ఎముకలు .. చెయ్యి .. అన్నీ విరిగిపోయాయి.

ముసలి:— ఆఁ!!

మొదటి:— రక్తం ... వరద ..

ముసలి:— పాపం ...

మొదటి:— బాధ .. భరించలేని బాధ.

ముసలి:- అంత దెబ్బతగిలితే ఎంత సేపుకావాలి ప్రాణం పోవటాన్కి.

మొదటి:- ఉహుం... ప్రాణందానంతటది...పోలేదు.

ముసలి:- మరి?

మొదటి:- చాలాసేపు బాధపడ్డాడు ... బాధభరించలేక... చివరికి ...

ముసలి:- ఆఁ ... చివరికి ?

మొదటి:- నన్నే ... యీ తుపాకీతో ... పేల్చమన్నాడు ... కాని ...

ముసలి:- ఆఁ ... ఆ ...

మొదటి:- కాని ... పేల్చలేకపోయాను ... పేల్చనన్నాను

ముసలి:- ఎందుకన్నావ్ ... వెంటనేపేల్చి సహంపోయిన ప్రాణాన్ని పూర్తిచెయ్యలేక పోయావా ..?

మొదటి:- చేశాను తాతా ... చేశాను ... అంతపనీ చేశాను ... చివరికి ...

ముసలి:- చేశావా! ...అమ్మయ్య ...చెయ్యెత్తి దణ్ణంపెట్టి వుంటాడతను.

మొదటి:- పెట్టాడు ... దణ్ణం పెట్టాడు...

ముసలి:- జన్మ జన్మాలకీ నీపేరుతల్చుకుంటాడు. స్నేహితుడికి ఏమానవ మాత్రుడూ చెయ్యలేని ఉపకారం చేశావ్.

మొదటి:- అనే అతనూ అన్నాడు.

ముసలి:- పాపం ... ఏదీ ... (వెతుకబోతూ) ఎక్కడ?.. అతనేడీ ... మనం త్వరగా అతన్ని సమాధిచేద్దాం.

మా పెద్దవాణ్ణి సమాధిలో పెట్టిన యీ చేతుల్తోనే ఇతన్నీ పెడతాను ... ఇతనూ మరోచిన్న కొడుకనుకుంటాను.

మొదటి:- అవునుతాతా ఇతను చిన్నకొడుకే!

ముసలి:- అవునవును .. యుద్ధంలోపోయిన వాళ్ళంతా నా బిడ్డల్లాంటి వాళ్ళేగా ... అవును ..

మొదటి:- కాదు .. తాతా!

ముసలి:-ఇంతకూ నాకు చూపించవేంఅతన్ని? ఎక్కడున్నాడు.

మొదటి:- అక్కడ ...

ముసలి:- (వెళ్ళి సమాధుల వెనుక చూస్తాడు)

మొదటి:- (కళ్ళుమూసుకుని వెనక్కు తిరిగిపోతాడు)

ముసలి:-(తిరిగి వస్తూ) పాపం. అదేపోడుగు..అదేమాదిరి.. సరిగ్గా మాచిన్న వాడిలాగే వున్నాడుకదూ! .. అదే వయస్సుకూడా! అయిపోయింది. ... ముందు ఇతన్ని సమాధి చేద్దాం నేనువెళ్ళి పనిముట్లూ .. అవ్వీ .. పట్టుకువస్తా. నువ్వు యిక్కడే ఇతన్ని చూస్తూవుండు. ఏం ? వస్తా? ... (వెళతాడు)



మొదటి:- (అటేచూస్తూ నిలబడి వున్నాడు ... వెనక్కి తిరిగి నడిచాడు .. మళ్ళీ 'తాత' వెళ్ళినవైపుకు తిరిగి చూస్తున్నాడు కాసేపట్లా చూసి పెద్దగా)

ఓ : హూ.. నేనెందుకు బ్రతికివున్నాను? .. ఎందుకు బ్రతికున్నాను? ఎందుకు బాంబు తగిలి చావలేదు?

 ప్రతిధ్వనులు. 2వ సైనికునిలోపలనుంచి మాటలు.

[లోపల్నుంచి ప్రతిధ్వని మూడుసార్లు వినిపిస్తుంది ... ఒకసారి కంటె మరోసారి దూరాన్నుంచి వస్తున్నట్లు శబ్దం తగ్గుతూ:-)

"ఎందుకు బాంబుతగిలి చావలేదు" ...

"ఎందుకు బాంబుతగిలి చావలేదు" ...

"ఎందుకు బాంబుతగిలి చావలేదు" ...

మొదటి:- ఈ తాత పుత్రశోకం చూడటానికేగా ...

ప్రతిధ్వని:- ఈ తాత పుత్రశోకం చూడటానికేగా ...

ఈ తాత పుత్రశోకం చూడటానికేగా ...

ఈ తాత పుత్రశోకం చూడటానికేగా ...

మొదటి-: అహఁహఁ .. నేనీమాట చెప్పలేను. చెప్పలేను యీమాట నానోటితో .. తాతాతో. వెళ్ళిపోతాను. పారిపోతాను. ఏదూరతీరానికో పారిపోతాను. ఇక యీ వూరు తిరిగి రాకుండా ఎక్కడికో అక్కడికి పారిపోతాను. ఇక ఎప్పటికి...

[లోపల్నుంచి రెండవ సైనికుడి కంఠస్వరంవినిపిస్తోంది]

కంఠస్వరం:- ఇక ఎప్పటికీ తిరిగిరాకుండా పారిపోతావా?

మొదటి:- ఆ (ఆశ్చర్యంగా) ఎవరా మాట్లాడేది?

కంఠస్వరం:- అప్పుడేమర్చిపోయావా? — నీస్నేహితుణ్ణి.

మొదటి:- నువ్వా? ... చచ్చిపోయినా ... ?

కంఠస్వరం:- ఆఁ చచ్చిపోయినా మాట్లాడగలనులే. పారిపోతానంటున్నావ్. ఎక్కడికి పారిపోతావ్. పారిపోయి సత్యాన్ని కప్పిపుచ్చగలవా?

మొదటి:– మరి యీవార్తతాతతో ఎలాచెప్పగలను? అతన్ని చూస్తేనే – నాగుండె...

కంఠస్వరం:– నిజమే. కానిచెప్పెయ్యి. అంతేకాదు మరణించిన తర్వాత 'తాత' 'తండ్రి' అనేవి లేవనికూడాచెప్పు నువ్వు చూడజాలని ఒకవింత లోకాన్ని నేనిప్పుడు చూడ గల్గుతున్నాను. ఇక్కడ చాలా ఛాయా దేహాలు కనిపిస్తున్నాయి. బహుశా దీన్నే పిశాచ లోకం అంటారు మానవులు ... ఏదైనా తల్లీ, తండ్రి చుట్టరికాలు యిక్కడలేవు. ముక్కుపొడుగూ, పొట్టీ బేధాలులేవు. చర్మం నలుపూ, తెలుపూ భేదాలులేవు. అంతా ఒకటేజాతి. ఒకటే లోకంగా కనిపిస్తోంది. దీన్నంతా చూస్తుంటే నాకాశ్చర్యంగా వుంది. 'ఈ ఆత్మలేగల మానవ శరీరాల్లో యీభేదాలెందుకున్నాయా'? అని..." ఈభేదాలతో యీర్ష్యల పెంచుకుని, ఒకళ్ళ నొకళ్ళు చంపుకుని, మానవుడెందుకు యీపిశాచలోకాన్ని సృష్టిస్తున్నాడా!" అని –

మొదటి:– ఆ లోకాన్ని మానవుడే సృష్టించాడా?

కంఠస్వరం:– ఆఁ.. మానవుడే ఈఅసంతృప్తిరూపలోకాన్ని సృష్టిస్తున్నాడు. ఇక నేవెళ్తున్నాను, నా ప్రశ్నకు జవాబు మీలోకాన్నడిగి తెలుసుకో ...

మొదటి:– ఆగు ... ఆగు ... వెళ్ళేవా ... [కాసేపు ఆలోచిస్తూనుంచున్నాడు — వెనక్కితిరిగి నడిచాడు. తలెత్తి చూసేసరికి ఏదో కనిపించింది] ... ఎవరది? ... ఎవరావచ్చేది... (వెనక్కు నడుస్తూ) ఎవరు.

నువ్వేనా . . . నానేస్తానివి? . . . ఆగు . . . అక్కడే ఆగు . . . రాక . . . (వెనక్కి వెనక్కి పోతాడు, ఖంగారుగా)

[నల్లని దుస్తుల్లో ఒకవ్యక్తి ప్రవేశిస్తుంది. చేతుల్లో ఏదో వున్నది]

మొదటి:- ఎవరునువ్వు—?

వ్యక్తి:- ఒక దౌర్భాగ్యురాల్ని. నువ్వూ . . నువ్వెవరివి?

మొదటి:- సైనికుణ్ణి.

వ్యక్తి:- సైనికుడా!

మొదటి:- పారిపోయి ఇంటికివస్తున్న సైనికుణ్ణి.

వ్యక్తి:- యీదేశం వాడివేనా?

మొదటి:- యీవూరివాణ్ణే.

వ్యక్తి:- అయితేసరే. నాకు కాస్తసాయం చేస్తావా?

మొదటి:- ఏమిటి?

వ్యక్తి:- యీపసివాణ్ణికాస్త సమాధిచెయ్యాలి.

మొదటి:- సమాధా? ఎవరిది?

వ్యక్తి:- నాకొడుకు ...

మొదటి:- చచ్చిపోయాడా?

వ్యక్తి:- చచ్చిపోయాడు ... ఇప్పుడొచ్చిన విమానాలు వేసిన బాంబుల్కి ... కాస్త సహాయంచెయ్యి. నే త్వరగా వెళ్ళాలి.

మొదటి:- ఏం?

వ్యక్తి:- ఇంకోపిల్లవాడున్నాడు. నిదరపుచ్చివచ్చాను, నిదర లేచేలోపల యీపనిపూర్తి చేసుకుపోవాలి.

మొదటి:- సరే కానియ్యి. (పిల్లవాణ్ణి తీసుకోబోయి; ము
కుని - ఆగి)!! వళ్ళింకా వేడిగానేవుంది.

వ్యక్తి:- మొహం నవ్వుతూనేవుంది. పాలిణాలొక్క క్షణంలేవు.
చిటికెలో విమానాలెత్తుకుపోయాయి. నిమిషంల
చిన్ననాయన వేరైపోయాడు.

మొదటి:- విచారించకమ్మా. నీబోటి వీరమాతలే...

వ్యక్తి:- వీరమాత! వీరమాత - వర్ణనలకేం ... మ
సొచ్చినట్లు వర్ణించవచ్చు... కాని ఆవీరమాత హృ
యం తెల్సుకోటం చాలాకష్టం.

మొదటి:- మనబోటివాళ్ళుత్యాగం చేస్తేనే ముందువాళ్ళకి..

వ్యక్తి:- త్యాగం .. త్యాగం .. మేంచేసిన త్యాగంనీకే
తెల్సు... తెలిస్తే నువ్విలాఅనవ్.

మొదటి:- తెలియకేం- అంతా తెలుసు ..

వ్యక్తి:- తెలీసుదు, ఏమీ తెలియదు. యుద్ధ పరికరాల్లో
ఒక పరికరానివినువ్వు. బాంబు విసిరిన తర్వాత ..
ఏమైందో, ఎంతమంది అమాయకుల్ని బలితీసుకుందో
నీకు తెలియదు.

మొదటి:- నాకూ ..

వ్యక్తి:- నాకిప్పుడు 25 ఏళ్ళు. 18 వ ఏటనే ప్రేమించి పెళ్లి
చేసుకున్నాను. రెండేళ్ళు ఎంతో అనురాగంతో
కాపురంచేశాను. ఒక మగపిల్లవాడు కలిగాడు.
ఆర్నెల్లయిందో లేదో యుద్ధంవచ్చిమావార్ని పిల
చుకు పోయింది. ఆయన తుపాకి భుజానవేసుకొం

మొదటి:- సరే కానియ్యి. (పిల్లవాణ్ణి తీసుకోబోయి; ముట్టుకుని - ఆగి)!! వళ్ళింకా వేడిగానేవుంది.

వ్యక్తి:- మొహం నవ్వుతూనేవుంది. ప్రాణాలొక్క-శే లేవు... చిటికెలో విమానాలెత్తుకుపోయాయి. నిమిషంలో చిన్నవాయన వేరైపోయాడు.

మొదటి:- విచారించకమ్మా. నీబోటి వీరమాతలే...

వ్యక్తి:- వీరమాత! వీరమాత - వర్ణనలకేం ... మన సొచ్చినట్లు వర్ణించవచ్చు... కాని ఆవీరమాత హృదయం తెల్సుకోటం చాలాకష్టం.

మొదటి:- మనబోటివాళ్ళు త్యాగం చేస్తేనే ముందువాళ్ళకి...

వ్యక్తి:- త్యాగం .. త్యాగం .. మేంచేసిన త్యాగంనీకేం తెల్సు... తెలిస్తే నువ్విలాఅనవ్.

మొదటి:- తెలియకేం- అంతా తెలుసు ..

వ్యక్తి:- తెలీసుదు, ఏమీ తెలియదు. యుద్ధ పరికరాల్లో ఒక పరికరానివినువ్వు. బాంబు విసిరిన తర్వాత ... ఏమైందో, ఎంతమంది అమాయకుల్ని బలితీసుకుందో నీకు తెలియదు.

మొదటి:- నాకూ ..

వ్యక్తి:- నాకిప్పుడు 25 ఏళ్ళు. 18 వ ఏటనే ప్రేమించి పెళ్ళి చేసుకున్నాను. రెండేళ్ళు ఎంతో అనురాగంతో కాపురంచేశాను. ఒక మగపిల్లవాడు కలిగాడు .. ఆశ్నెల్లయిందో లేదో యుద్ధంవచ్చిమావార్ని పిలుచుకు పోయింది. ఆయన తుపాకి భుజాన వేసుకొని

వీధిలో March చేసుకుంటూపోతూంటే నేనూ ఒక 'వీరవత్ని' నని గర్వించాను.

మొదటి:- ఆఁ!

వ్యక్తి:- మరో ఏడాదికి యీవూరు శత్రువశమైంది. శత్రు సైన్యాల చేతుల్లోపడి మాసర్వస్వాన్నీ గోల్పో యాం .. ఒక్క మాప్రాణాలూ పిల్లల ప్రాణాలూ తప్ప ..

మొదటి:- అహాఁ!.

వ్యక్తి:- మీకు తెలిసిందల్లా యుద్ధచెయ్యటం- కాని, ఆయన తిరిగివస్తే యీ మొహం ఎల్లాచూపించాలో నాకు తెలియదు.

మొదటి:- కాని... ఒకమాట

వ్యక్తి:- ఇంకామాట ఏమిటి? నీకూ ఒకసోదరివుంటే ...నీకూ ఒకభార్యవుంటే వాళ్ళూఇలాగే యుద్ధంలో పరాభ వించబడితే, తెలిసేదినాక్షోభ ... యీపరాభవ ఒక రోజూ, రెండు రోజులూకాదు. నెలలు...ఒక తేవ్యధగా ఒకతే కసాయికోతగా... చిట్టచివరికి ఎలాగో మన వాళ్ళు యీ వూరిని, వశబరచుకున్నారు. కాని అప్ప టికే నేనొక గర్భిణీని ...

మొదటి:- ఏమిటి? ...

వ్యక్తి:- 9 నెలలు గడచి పిల్లవాణ్ణి కన్నాను ... పిల్లవాడు నేనెంతో అసహ్యించుకొనే పిల్లవాడు... కాని... నా పిల్లవాడు ... ప్రపంచంలో ఏ తల్లీ అసహ్యించుకోనంతగా అసహ్యించుకొంటూ ... ద్వేషించనంతగా

ద్వేషిస్తూ ... యీ చేతుల్తోనే ... యీ దేహం తోనే ఆపాప స్వరూపాన్ని పోషించి పెంచాల్సి వచ్చింది. పెంచుతున్నాను, మెడపిసికి చంపలేని బల హీనతవల్ల.

మొదటి:- అర్థమయింది.

వ్యక్తి:- ఓ! నే చావలేను. పిల్లలకోసం బ్రతకాలి. యీ జీవితంమీద అసహ్యం పుట్టినా, యీదేహం మీద రోత పుట్టినా, బ్రతక వలసిందే. బ్రతికి ఏదో ఒకనాడు ఆయన్ని చూడక తప్పదు. యుద్ధం ముగియగానే ఆయనవస్తారు. వస్తే ఆయనకి యీపిల్లాణ్ణి చూపించక తప్పదు. చేతిలో ఆపిల్లాడితో ఎదురువెళ్ళి స్వాగతం ఇవ్వాలి. ఏమి స్వాగతం? ఏముఖంతో స్వాగతం? ఏ అనురాగంతో ఎదురు వెళ్ళను?

మొదటి:- ఆపిల్లవాణ్ణి ... చంపేస్తే?

వ్యక్తి:- నీకు చంపటంతప్ప వేరేంచేతకాదు. 9 నెలలుమోసి కని, పెంచిన, పసిగుడ్డును, యీచేతుల్తో చంపడం నాచేతకాలే. ఆయనవస్తే జరిగేసంగతి అనూహ్యం. ఆయనరాకుండావుంటే... అవును ... అప్పట్నుంచి ఆయన రాకుండా వుండాలనే కోరుతున్నా... భగవం తుణ్ణి ప్రార్థిస్తున్నా. యుద్ధంనుంచి ఆయన తిరిగి రాకుండా ... యుద్ధంలోనే ఆయన అణగిపోవాలని ...ఇవాళ విమానాలొచ్చాయ్...నిరాశతో ఎండి పోయిన నాహృదయంలో వింత ఆశల్ని రేకొల్పాయ్.

ఆపాపిష్టి సంతానాన్ని చేతిలోవుంచుకుని, ఆకాశం లోనే ఆశలు పెట్టుకుని, ఆరుబైట విమానాలవెంట బాంబులు పడేవైపుకు పరుగెత్తిపోయాను. కాని అవేవీ యీమలిన దేహాన్ని ముట్టుకోలేదు... ఇంటికి తిరిగివచ్చాను. మాయింటిమీద బాంబులు పడ్డాయి.. మా అనురాగ సౌధం కూలిపోయింది. మా అనురాగాల పోగు, ఈ పెద్ద పిల్లవాడు చచ్చిపడి వున్నాడు.

మొదటి:- ఆపవమ్మా ...

వ్యక్తి:- ఎందుకాపాలి? నువ్వూ నీలాంటివాళ్ళతో కలిసి, నీలాంటి శత్రువులతో యుద్ధంచేసి మాకు తెచ్చి పెట్టేది యిదేగా ... నీకిదికొత్తా! నీచేతుల్లో ఎంత మందిని చంపావో ఎంతమందిని చెరిచావో ... నీకు తెలియదా?

మొదటి:- తెలుసు.

వ్యక్తి:- తెలుసు... యీపనులు అంతా తెలిసేచేస్తుంటారు. ఐతే యీ కళేబరాన్ని ఏంచెయ్యాలో నీకు తెలిసే వుంటుంది. వీడూ నీలాంటివాడి కొడుకే ... ఇంద ... తీసుకో... నీయుద్ధఫలితాన్ని.

(కళేబరాన్ని అతని చేతుల్లో పడవేసి వెళ్ళిపోయింది)

మొదటి:- నేనేంచేసుకోను!

వ్యక్తి:- ఏంచేసుకున్నా సరే 

మొదటి:- ఉద్రేకపడకమ్మా... నీకొడుకును సమాధిచేద్దాం.

---

ముదుసలి పరివేశం Dimlight focus on ముదుసలి.

వ్యక్తి:- నేచెయ్యలేనా. పని ... మాతృహృదయానికి
పోషించడం చేతనవునుకాని, పుట్టించిపెట్టడం చేత
కాదు. అదిచేతనయింది నీకు . . . (వెళ్ళిపోయింది)
మొదటి:- ఏమిటిది! . . సైనికుడంటేఇదా! . . . ఇదా, నా
పని? పట్టి కాటికాపరా? కసాయివాడా సైనికుడంటే?
కాదు. నేకసాయివాణ్ణి కాదు.
(లోపల్నుంచి కంఠస్వరం వినిపిస్తుంది)
కంఠస్వరం:- కాక మరెవరివి?
మొదటి:- ఏమిటీ...
(వక ముసలి గోరీలమాటునుంచి బయటికి వస్తాడు)
మొదటి:- (తెల్లబోయి, ఆశ్చర్యముతో) ఏమిటది· ఎవరు
నువ్వు.
ముదుసలి:- ప్రపంచం అంతా విస్మరించిన వక ముసలివాణ్ణి
మొదటి:- ఆ. అంటే నా కర్థంకాలేదు. ఎవరివినువ్వు,
యిప్పుడు యీ గోరీలమధ్య ఎందుకున్నావ్.
ముదుసలి:- ఉన్నాను, ఇదే నానివాసంగనక. దానిదేముందిలే
ప్రతివాడూ ఎక్కడో వక అక్కడ వుండాలి. నేనీ
గోరీలమాటున ఉన్నా. ఈ గోరీలమాటున ఏముందో
నాకు బాగా తెల్సు. నీకు తెలుసా అదేమిటో.

మొదటి:- ఏముంది?

ముదుసలి:- దుఃఖం, అశాంతి, మనోక్షోభ.

మొదటి:- ఇదెవరికి తెలియదు.

ముదుసలి:- చాలామందికి తెలియదు. తెలిస్తే యిన్ని యుద్ధా

లెందుకు చేస్తారు. ఇన్ని మారణ యంత్రా
లెందుకు కనిపెట్టుతారు. నీ చేత, యిన్ని యుద్ధా
లెందుకు చేయిస్తారు.

మొదటి:- ఎవరెందుకు చేస్తున్నారో. నేనుమాత్రం
నా దేశంకోసం ప్రాణాలొడ్డి పోరాడుతున్నాను.

ముదుసలి:- అబద్ధం ... ఆత్మవంచన.

మొదటి:- ఆ- మరి... నేపోరాడుతున్న దెందుకు?

ముదుసలి:- దేశంపేరిట, ప్రజాసేవపేరిట- నీస్వజనులకోసం-
నీస్వార్థంకోసమే పోరాడు తున్నావ్.

మొదటి:- కాదు. దీంట్లో స్వార్థంలేదు. నాప్రజలకోసం,
ప్రజా స్వాతంత్ర్యంకోసం ... ప్రజాభివృద్ధికోసమే
పోరాడుతున్నాను.

ముదుసలి:- నీవిరోధికూడా అతని ప్రజలకోసం, స్వతంత్రం
కోసం, అభివృద్ధికోసం పోరాడుతున్నా నంటున్నాడు.

మొదటి:- అబద్ధం ... అదంతా అబద్ధం.

ముదుసలి:- నీది అబద్ధమని అతనంటున్నాడు.

మొదటి:- ఆశత్రువే నామీద దండెత్తాడు మొదట.

ముదుసలి:- ముందునువ్వుచేసిన అన్యాయమే యుద్ధంలోకి
దింపిందంటాడు అతను.

మొదటి:- అయితే ... యిది తేలేదెట్లా ... ?

ముదుసలి:- ఎందుకు తేలదు? ... ముందు మీహృదయాల్లో
ద్వేషం బయలుదేరింది. ఆ ద్వేషం పరస్పర అను
మానాలకు దోవతీసింది, యీఅనుమానం మీయిరు
పక్షాలకి భేదం కలిగించింది. యీ భేదం మీయిద్దర్నీ

వేరుపరచి జాతి మత విభేదాలకి దారితీసింది ...
ఇవన్నీ యుద్ధాలకు దోవతీసినై,

మొదటి:- కావచ్చు. కానీ ... యీ అసూయతో నేను యుద్ధం చెయ్యటంలేదే! ఈర్ష్యలతో యుద్ధంచెయ్యటంలేదే. దేశమాత ఆర్తనాదంవిని ... మాతృమూర్తి ఋణం తీర్చుకోటానికి యీ యుద్ధంలో కురికాను.

ముదుసలి:- దేశభక్తి - స్వార్థానికి మరోపేరు. ఈ అనంత భూతలం ఏఒక్కడి దేశంకాదు-అందరిదీను. ఈకనపడే ఎల్లలూ ... హద్దులూ మనం కల్పించుకున్నవే... వాటిని మనం మార్చుకోగలం ... "విశ్వవసుధంరంతా ఒకటేదేశం. విశ్వమానవులంతా ఒకటేజాతి" అని అందరూ వప్పుకుంటున్నారు. మానవులంతా ఒకటే అయితే జాతిద్వైషమ్యాలెందుకు? జాత్యహంకారాలెందుకు? జాతియుద్ధాలెందుకు?

మొదటి:- ఎందుకు...ఎందుకు?



ముదుసలి:- ఎందుకా? ... మీనాయకుల నాయకత్వం కోసం. దేశభక్తిపేరిట జాత్యహంకారాన్ని రెచ్చకొట్టి మిమ్మల్నందర్నీ యుద్ధంలోనే నిమగ్నుల్నిచేసి.

---

Light soff. అలెగ్జాండర్, అశోక, వక మహమ్మదీయ చక్రివర్తి నెపోలియన్, Lloyd George Hitler వరసగా వెనకతెరమీద Magiclantern తో focus చేయబడతారు వారి వారి భావల్లో వారు మాట్లాడతారు. ఈ 5 కంఠస్వరాలవారూ తయారవాలి.

తమనాయకత్వాన్ని నిలుపుకోవటానికి, మీ నాయకులు పన్నిన పన్నాగం— యిది.

మొదటి:- కాదు... మానాయకుడు- "శాశ్వతమైన శాంతి కోసం...యుద్ధరాక్షసి హతమారిపోవటంకోసం"... అంటున్నాడు. యుద్ధాన్ని అణగకొట్టటానికి యుద్ధమే సులభమార్గం.

కంఠస్వరం:- 'యుద్ధాల్ని అణగ కొట్టటానికి యుద్ధమే సులభ మార్గం' అని మీనాయకుడన్నాడు. ఈ మాటలే అనేక శతాబ్దాలనుంచి అనేకమంది మహానాయకులూ అంటున్నారు...అనేక శతాబ్దాలకుపూర్వం..అలెగ్జాండర్ (అలెగ్జాండర్ అనగానే రంగమంతా చీకటౌతుంది ఆకాశంలో అలెగ్జాండర్ కనిపిస్తాడు.)

ALEXANDER:- దిగంచలాలవరకూ గల వివిధ దేశాలనూ జయించి ప్రపంచానికే చక్రవర్తి నౌతాను.

కంఠస్వరం:- అశోకుడు (అనగానే అలెగ్జాండర్ అంతర్ధానమై అశోకుడు కనిపిస్తాడు)

అశోకుడు:- "అఖిల భారతాన్ని ఏకచ్ఛత్రించేసి సుస్థిరశాంతి రాజ్యారమను స్థాపిస్తాను."

కంఠస్వరం:- ఇంకా Aifred the great మొదలుగాగల అనేకమంది మహావీరులూ ... మధ్యకాలంలో అనేక మహమ్మదీయ చక్రవర్తులూ...

[ఏక మహమ్మదీయ చక్రవర్తి ఆకాశంలోకనిపిస్తాడు.]

మహమ్మదీయ చక్రవర్తి:- మైపూరీ దునియాకో ఫతేహాకర్కే జిస్ మేకామిల్ ఆజాదీ ఒస్కూన్‌కి హుకుమత్

ఫాయంకరే—, ఏఖీకామ్... ఏఖీ మజహబ్...
ఏఖీ ఝండా లహరావుంగా. (ఉరుదు)
కంఠస్వరం:- యీమధ్యనే Napoleaon— (నెపోలియన్ కనిపిస్తాడు)
నెపోలియన్:- ఝువెన్‌క్రై—లెథోమాన్‌త్ ఎత్ఎతాబ్లెర నాతెరొారోమ్ సో ఉనెబసేర్. (ఫ్రెంచి)
కంఠస్వరం:- Lloyd George [లాయడ్ జార్జి కనిపిస్తాడు.]
Lloyd george:- Our war is to end all wars
కంఠస్వరం:- హిట్లర్ [హిట్లర్ కనిపిస్తాడు.]
హిట్లర్:- ఇఖ్ బెసీగెన్ ది గాంజ్ వెల్ట్ ఉంట్ బ్రింగెన్ ఆలె లాండన్ ఉంటర్ ఐన్ రైష్. ఐన్‌లాండ్; ఐన్ కొనిగ్; ఐన్‌రైష్; ఐన్‌ఫోల్క్. (జర్మని)
తిరిగి లైట్లు వెలుగుతాయి.
కంఠస్వరం:- అందరూ ఇదేమాట అన్నారు. అందరూ కుమిలిపోతున్న భూమాత కాలగర్భంలో అంతర్లీనమై పోయారు. గతించిన చరిత్రనుంచి గుణపాఠం నేర్చు కోకపోతే మానవుడి ప్రత్యేకత ఏముంది.

... యుద్ధం ఆపివేయడానికి యుద్ధం మానివెయ్యాట మేమంను. కాని...యుద్ధం చేయటంకాదు.

యుద్ధానికి కారణంస్వార్థం... యీర్ష్య ... దురాశ 'యుద్ధం' తనతోపాటు ఆకలి ... దరిద్రం కరువు ... దుఃఖం తెస్తుంది. ఈ నిరాశలో మానవుడు మళ్ళీ యుద్ధానికే దారితీస్తాడు. కాబట్టి యుద్ధానికి జవాబు యుద్ధంకాదు, శాంతిస్థాపన. దేశాభివృద్ధికోరే ఏనాయ

కుడూ యుద్ధాన్ని కోరడు. శాంతినే వాంఛిస్తాడు, శాంతికి ముందే అభివృద్ధి ఆనందం. వస్తాయి ... శాంతి శోభ ... అభివృద్ధి. యుద్ధపునీడ ... సర్వనాశనం. శాంతిచిహ్నం ఐక్యత. ... యుద్ధచిహ్నం విభిన్నత శాంతిఫలితం సంతృప్తి!!... యుద్ధఫలితం ... యుద్ధం!!

మొదటి:- అవును... కాని యీయుద్ధం కావాలని నేనెప్పుడూ కోరలేదే!

ముసలి:- కోరలేదు... నీబోటి సామాన్యుడెప్పుడూ కోరలేదు. కోరింది కొద్దిమంది స్వార్థపరులు మాత్రమే! వాళ్ళేనాయకత్వం వహించి ప్రపంచాన్ని సంగ్రామంలో దింపుతున్నారు ... నీబోటి సామాన్యుల్ని బలిపెడుతున్నారు.

మొదటి:- నా దేశ స్వాతంత్ర్యత మీదకు దాడి చేస్తేనే యుద్ధం చెయ్యకపోతే ఎలా?

ముసలి:- దాడివచ్చేవరకూ ఎందుకూరుకున్నావ్. దాడిరాకముందే 'శాంతిప్రాముఖ్యం' ప్రజలందరికీ నచ్చజెప్పి ప్రపంచంఅంతా ఒకేజాతి అని బోధించు. అన్ని దేశాలలోనూ ఐక్యత సాధించు...

మొదటి:- దీనికి అన్ని దేశాల ప్రజలూ పూనుకోవాలి, అది సాధ్యమా?

ముసలి:- ఎందుకుసాధ్యంకాదు?... ఇన్ని దేశాలు కూడగట్టుకుని ఇంత పెద్దపెట్టున యుద్ధ సన్నాహాలు చేస్తున్నారే ... ఇంత ప్రయత్నమూ చేస్తే శాంతి సుస్థిరం కాకపోయిందా! ... నీనాయకులిది చెయ్యక ...

కుడా యుద్ధాన్ని కోరడు. శాంతినే వాంఛిస్తాడు. శాంతికి ముందే అభివృద్ధి ఆనందం. వస్తాయి ... శాంతి శోభ ... అభివృద్ధి. యుద్ధపునీడ ... సర్వనాశనం. శాంతిచిహ్నం ఐక్యత. ... యుద్ధచిహ్నం విభిన్నత శాంతిఫలితం సంతృప్తి!!... యుద్ధఫలితం ... యుద్ధం!!

మొదటి:- అవును... కాని యీయుద్ధం కావాలని నేనెప్పుడూ కోరలేదే!

ముసలి:- కోరలేదు... నీలాంటి సామాన్యుడెప్పుడూ కోర లేదు. కోరింది కొద్దిమంది స్వార్థపరులు మాత్రమే! వాళ్ళేనాయకత్వం వహించి ప్రపంచాన్ని సంగ్రామాల్లో దింపుతున్నారు ... నీలాంటి సామాన్యుల్ని బలిపెడుతున్నారు.

మొదటి:- నాదేశ స్వాతంత్ర్యాత మీదకుదాడి చేస్తేనే యుద్ధం చెయ్యకపోతే ఎలా?

ముసలి:- దాడివచ్చేవరకూ ఎందుకూరుకున్నావ్. దాడిరాక ముందే 'శాంతిప్రాముఖ్యం' ప్రజలందరికీ నచ్చజెప్పి ప్రపంచంఅంతా ఒకేజాతి అని బోధించు. అన్ని దేశాలలోనూ ఐక్యత సాధించు...

మొదటి:- దీనికి అన్ని దేశాల ప్రజలూ పూనుకోవాలి. అది సాధ్యమా?

ముసలి:- ఎందుకుసాధ్యంకాదు?... ఇన్ని దేశాలు కూడగట్టుకుని ఇంత పెద్దపెట్టున యుద్ధ సన్నాహాలు చేస్తున్నారే ... ఇంత ప్రయత్నమూ చేస్తే శాంతి సుస్థిరం కాకపోయిందా! ... నీనాయకులిది చెయ్యక ...

సామ్రాజ్య కాంక్షలతో నీదేశానికి స్వలాభం చూపించి యుద్ధాల్లోకి దింపుతున్నారు. నీనాయకులు విస్మరించినపని నీమీదపడింది. నువ్వే నాయకత్వం వహించి శాంతిప్రచారంచెయ్యి. ఇదినీవిధి. నీబోటి వాళ్ళందరివిధి.

[ముదుసలి అదృశ్యమై పోతాడు]



మొదటి:- నావిధి... నాబోటివాళ్ళందరివిధి. ఈ సందేశాన్నే అనేకమంది మహాత్ములు అనేకసార్లు అందించారు యీమానవ లోకానికి. కాని ... ఎందువల్ల యీ ప్రపంచం యీఅమూల్య సందేశాన్ని ప్రతితడవా విస్మరిస్తోంది? ఎందుకని యీ అమర సందేశం ప్రతి సారీ పరాభవింప బడుతోంది?... ఎందుకని??? ... ఎందుకని???... ???

[రెండు కొమ్మలమధ్య ఒకపావురం కనబడుతుంది వెనక స్వచ్ఛమైన కాంతివలయంతో ... ]

పావురం:- ఎందుకనా? ప్రతిమనిషిలోనూ కాస్తన్నా స్వార్థం ఎప్పుడూ వుండటంవల్ల! అధికారంలోవున్న యీ దురాశాపరులు యీస్వార్థానికే ప్రోత్సాహం యివ్వ టంవల్ల మనిషిలో మిశ్రమంగావున్న మంచిచెడల్లో... చెడతనానికే ప్రోత్సాహం ఎక్కువగా వుండటంవల్ల! ప్రక్కవాడిప్రాణం నువ్వుతీసినన్నాళ్ళు ప్రపంచంలో

---

(పావురం చిహ్నం) పెట్టెతో చేసిన పావురంగాని, నిజమైన పావురంగాని కనిపిస్తుంది. బొమ్మ పావురమైతే Lightsoff. on పావురం.

శాంతివుండదు. ఒకడి సౌభాగ్యానికి నువ్వడ్డువెళ్ళ కుండావుంటే సౌభాగ్యాని కెవరూ అడ్డురారు. పక్క వాడి కష్టాల్లో సహాయపడితే నీకువాడు సహాయపడ తాడు. ప్రపంచంలో యీసౌహార్ధ్రత త్యాగశీలత ఎక్కువైతే... అదే ప్రపంచ సౌఖ్యానికి దారితీస్తుంది. మానవాభ్యుదయానికి ఆశాకిరణం అదొక్కటే ఒకటి! (పావురం అదృశ్యమౌతుంది)

మొదటి:- మానవాభ్యుదయానికి ఆశాకిరణం అదొక్కటే ఒక్కటి, ఎప్పుడీ వక్క కిరణం సర్వప్రపంచానికి వెలుగునిచ్చి అంధకారాన్ని పటాపంచలు చేస్తుంది. [వేరే కంఠస్వరం వినిపిస్తుంది.]

కంఠస్వరం:- సదాయుద్ధాన్ని వరించే స్వార్థపరుల్లారా! ... సదా కంఠాల్ని కత్తిరించే కసాయి సైనికుల్లారా! ... నన్ను చూసైనా మీప్రయత్నం ఆపండి. నన్ను చూసైనా మీయుద్ధప్రయత్నం ఆపండి.

మొదటి:- ఏమిటీవిచిత్రం! ... ఎవరీమాట్లాడేది?

[వ్యక్తి తెల్లనిదుస్తుల్లో ప్రవేశించి, సైనికుడివంక చూడకుండానే తనలోతాను మాట్లాడుకుంటూ ఒక పక్కనుంచి మరోప్రక్కకు నడిచిపోతుంది]

మొదటి:- ఏమిటది? ఎవరునువ్వు?

వ్యక్తి:- యుద్ధరాక్షసి భీకర దంష్ట్రాగ్నుల్లోపడి- కాలి కుమిలి పోయిన సామాన్యస్త్రీని.

మొదటి:- ఇందాక వచ్చింది నువ్వేనా? నువ్వేనా?... నిన్ను చూస్తే ... నాకు ... నా ...

వ్యక్తి:- తోటి మానవుడే ధన ప్రాణ మానాల్ని దోచుకోగా, నీచపు బ్రతుకులో నిరుత్సాహపడి, నిండు ప్రాణాల్ని విడిచిన నిర్భాగ్యురాల్ని.

మొదటి:- అయితే నువ్వు ...

వ్యక్తి:- ప్రపంచంలో తలఎత్తుకు తిరగగల ప్రాప్తం సంపూర్తిగా తుడుచుకు పోగా తెగించి భవ బంధాల్ని తెంపివేసుకున్న తెగువరిని.

మొదటి:- అయితేనువ్వు ... మనిషివి...

వ్యక్తి:- అసంతృప్తితోజీవించి అసంతృప్తిగా మరణించి ... అసంతృప్తితో యీ అనంత భూతలంచుట్టూ తిరుగుతున్న అమానుష అశాంతిరూపాన్ని...

మొదటి:- ఓ... మనిషివికావు...

వ్యక్తి:- మనిషిని కాకపోయినా మాతృమూర్తినే. దిక్కుమాలిన యీపిల్లల్ని విడచి ఏలోకానికి పోను? ప్రాణాల్ని తీసుకోగలిగానుగాని కడపుతీపి నెలా కోసుకోను,

మొదటి:- నీపిల్లల్ని నేచూస్తాను....

వ్యక్తి:- నీబోట్లు వెయ్యిమందైనా ఒక తల్లితో సమానం కాలేరు. నాపిల్లలు నాచేతులతో పెరిగితేనే నాకు తృప్తి.

మొదటి:- ఐతే ... నన్నేంచెయ్యమంటావ్? ఏంకావాలంటావ్? అసలెందుకు వచ్చావ్?

వ్యక్తి:- ఏదీచెయ్యమనటంలేదు. నీకేమయినా చేతనయితే నాబోటి వాళ్ళను తయారు చెయ్యకు!

మొదటి:- అంటే ... నాకు ... అర్థంకాలా.

వ్యక్తి:- ఏనిండు ప్రాణాల్ని నిలువునాతియ్యకు. ఏతల్లిగర్భాన చిచ్చుపెట్టకు (వెళ్ళిపోబోగా)

మొదటి:- ఆగు... ఎవరునువ్వు ... ఆఒక్కమాట చెప్పు.

వ్యక్తి:- ఒక సామాన్యురాల్ని.

మొదటి:- కాదు నిన్నుచూస్తుంటేనాకు ...

వ్యక్తి:- అంతే... అంతకంటే నేనెవర్నీకాను.(వెళ్ళిపోయింది)

మొదటి:- [అలే చూస్తాడు కాసేపు. తర్వాత క్రిందనున్న పిల్లవాడి కళేబరం వంకచూసి] ఇక్కడ ఒక పసివాడు ... అక్కడఒక సైనికుడు ఇక్కడ ప్రపంచం అంటే అర్థంకాని ఒకలేతమొగ్గ. ప్రపంచాన్నిచూసి వికసించి ఫలించబోయే ఒక లేత పిందె ... ఇద్దరూ నిస్తబ్ధులై పోయారు...

[కాసేపాగి పిల్లవాణ్ణి చేతుల్లో తీసుకుని ఆలోచిస్తూ వుండగా ముసలివాడు వస్తాడు]

ముసలి:- ఏం ప్రపంచం... ఏం జీవితం... అబ్బ...

మొదటి:- (దగ్గరకెళ్ళుతూ) తాతా!

ముసలి:-తాత! తాతనైవుండికూడా ఎందుకుబ్రతికివున్నానాఅని

మొదటి:- ఏమయిందితాతా?

ముసలి:- నీకు తెలుసుగా నాకున్న యిద్దరు కొడుకుల్లో పెద్దవాడు పోయాడు.

మొదటి:- ఆఁ!

ముసలి:_ పెద్దవాడు పోయిన తర్వాత యీ చిన్నవాడిమీద నాకెంతో మమకారం పెరిగింది ... పెద్దతనంలో పుట్టాడుకదూ ...

మొదటి:_ అవును.

ముసలి:_ వీణ్ణి చూసుకుని దుఃఖం దిగమింగుకునే వాణ్ణి.

మొదటి:_ అయితే ...!

ముసలి;_ ఈ కష్టసుఖాల్లో పండిపోయిననాకు ప్రాణం విలువ బాగా తెలుసు.

మొదటి:_ అంతేగామరి.

ముసలి;_ ఎక్కడయినా ప్రాణం పోయిందనగానే నామనస్సెంతో బాధపడుతుంది.

మొదటి:_ నిజమే గాని మనం ఏంచెయ్యగలం?

ముసలి:_ మనచేతిలో ఏదోవుందనికాదు. కాని ఆమాటలో మాత్రం ఏంవుపశాంతివుంది_చెప్పు యీ హృదయానికి...

మొదటి:_ ఆఁ ... అదీ నిజమే.

ముసలి:_ నేనిక్కడికి రాకముందు Air Raid వచ్చింది. చూశావ్ ...

మొదటి:_ ఆఁ, అవును.

ముసలి:_ ఆ Raid లో బాంబులు....

మొదటి;_ అవును. బాంబులు పడ్డాయి...

ముసలి:_ అవీ_మాయింటికీ మీయింటికీ మధ్యపడ్డాయి.

మొదటి:_ (నిర్ఘాంతపోయి) ఆ

ముసలి:_ మా ఇంట్లో సహాంకూలిపోయింది. మీ యిల్లా

సహం కూలిపోయింది.

మొదటి:- ఎవరికేం దెబ్బలు తగలలేదు కదా...

ముసలి:- బాంబుపడటానికి ముందే నేనిక్కడికి వచ్చాను కదూ ... దెబ్బలు తగిలటానికి మాయింట్లో ఎవరూ లేకపోయారు.

మొదటి:- మాయింట్లో ...??

ముసలి:- మీయింట్లో మీ ... కుర్రాడికి...

మొదటి:- దెబ్బతగిలిందా?

ముసలి:- ఆఁ... దెబ్బతగిలి ... పోయాడుట.

మొదటి:- తాతా...

ముసలి:- ఏడ్చి ఏం ప్రయోజనం నాయనా - సత్యాన్ని యివాళకాకపోతే రేపైనా తెలుసుకోవాలి. అక్కడంతాగలభాగావుంది. నీభార్య కనుపించలేదు. నేవెళ్ళేటప్పటికి రెండో పిల్లాడు ఉయ్యాల్లో వంటరిగా ఉన్నాడు.

మొదటి:- రెండోపిల్లాడా !?

ముసలి:- ఈగలభాలో నీభార్య ఏమయిందో తెలియదు.

మొదటి:- నాభార్య!!!

ముసలి:- మీ పెద్దపిల్లాడి శరీరమేమయిందో ...

మొదటి:- ఏమవలేదు తాతా!...ఇదిగో .. (పిల్లాడి శరీరం చూపిస్తాడు)

ముసలి:- ఇదా? యిక్కడికెలావచ్చింది!

మొదటి:- నాభార్య తెచ్చియిస్తేవచ్చింది.

ముసలి:- తెచ్చియిచ్చిందా?

మొదటి:- ఆ, నేనేభర్తనని తెలియక నాచేతికే యిచ్చింది.

ముసలి:- ఇక్కడికి వచ్చిందా?

మొదటి:- వచ్చింది. నే లేనప్పుడు తనకు జరిగిన అన్యాయ మంతా చెప్పింది. రెండో కొడుకు సంగతిచెప్పింది, ఈ పిల్లవాణ్ణి పాతిపెట్టుకోమని . . . వెళ్ళి . . .
(దుఃఖావేశంతో మాట్లాడలేకపోతాడు)

ముసలి:- వెళ్ళి . . . వెళ్ళుతూ దోవలో ఆత్మహత్య చేసుకుంది. నేను తిరిగి వస్తూంటే దోవలో ఆ శవం కనిపించింది.

మొదటి:- నాకాఆత్మ కనుపించింది.

ముసలి;- భగవాన్ (నిట్టూరుస్తాడు)

మొదటి:- భగవంతుడేంచేశాడు తాతా, సుఖపడమని యీ ప్రపంచంలో పుట్టించాడు. చేతకాక మనమే జీవితాన్ని దుఃఖభాజనం చేసుకుంటున్నాం.

ముసలి:- అంతే . . . అంతే . . . కానియ్యి యీకళేబరాన్ని . . .ఆ ఏడినీస్నేహితుడు.

మొదటి:- ఇదుగో . . . ఇక్కడ . . . సరిగా చూడలేదుగా యిందాక. ఇప్పుడుచూడు.

ముసలి :- చూడకేం? చూశాగా.

మొదటి:- చూశావా? గుర్తుపట్టలేదుకదూ?

ముసలి:- ఊహూఁ. ఎవరేమిటి? వెళ్లి చూస్తాడు)

మొదటి:- చూశావా . . . సరిగ్గా . . . నీకొడుకు.

ముసలి:- (పెద్దగా వెర్రిగా నవ్వి) కొడుకు . . మా చిన్న

వాడు ... పెద్దవాణ్ణి వెతుక్కుంటూ చిన్నవాడూ వెళ్ళాడు ...

మొదటి:- తాతా!

ముసలి:- వెళ్ళాడు. యిక ఎప్పటికీ తిరిగిరాకుండా - పెళ్ళాం పిల్లల్ని బాధపెట్టక్కర్లేకుండా...

మొదటి:- తాతా_ఏమిటిది,

ముసలి:- పోతే.. ఒక్క ముసలి తండ్రిని దుఃఖపెట్టాడు. అంతేగా అదేం మించిపోయిన పనికాదుగా (నవ్వుతాడు)

మొదటి:- దగ్గరకెళ్ళి) ఆగు.. తాతా!

ముసలి:- నేనేందుఃఖిస్తాననుకున్నావా? పట్టు యిద్దర్నీ సమాధి చేద్దాం. యింతకంటె ఘోరమైన పనులే చేశాను, యీ చేతుల్తో - ఎంత గుండెపగిలే ఘోరకృత్యాలు చెయ్యటానికైనా మొదటసారే కాస్త భయపడతాం. తరువాత అవిచాలా సులభకార్యాలు ... చాలా తేలిక పనులు .. రా .. దుఃఖించకు ... రా (వెళ్ళబోతాడు) 🐚

మొదటి:- ఆగుతాతా. వీళ్ళిద్దరూ యుద్ధపిశాచానికి బలియైన అమాయకులు.

ముసలి:- తండ్రి కడుపులో చిచ్చుపెట్టి కళ్ళుమూసిన కఠిన హృదయాలు.

మొదటి:- వీళ్ళిద్దర్నీ ప్రాముఖ్యంగా .. యీమధ్యన సమాధి చేద్దాం యిక్కడ.. ఇంతవరకూ ఏసమాధీ లేని చోట ..

(ప్రతిధ్వని మూడుసార్లు వినిపిస్తుంది)

---

🐚 ప్రతిధ్వనులు. lights dim get veady for sunrise

"ఇంతవరకూ సమాధిలేని చోటా?"

ఇంతవరకూ సమాధిలేని చోటా?

ఇంతవరకూ సమాధిలేని చోటా?

మొదటి:- అవును ... కాదా?

ప్రతిధ్వని:- కాదు ...— కాదు ...— కాదు ...—

మొదటి:- ఇక్కడ ఇదివరకే సమాధి వుందా?

ప్రతిధ్వని:- ఇక్కడిదివరకే చాలా సమాధులున్నె!

ఇక్కడిదివరకే చాలా సమాధులున్నై!!

ఇక్కడిదివరకే చాలా సమాధులున్నయ్!!!

ముసలి:- అవును భూమాత కడుపు పగిలి ఏడ్చేవరకూ అనేక మంది. అనేకచోట్ల సమాధిచేయబడ్డాగు. ఆసంగతి మనం విస్మరించాం. ఎంతమంది మనలాంటివారి మనో క్షోభను భూమాత గర్భస్థం చేసుకుందో యీ... శతాబ్దాల కాల పరిమితిలో.

మొదటి:- (నెమ్మదిగా ప్రారంభిస్తాడు) ... అయితేకానీ... ఇది మొదటిది కాకపోతే ఆఖరిది, కానియ్యి. ఇక్కడే కాదు, ఎక్కడా ఏవక్కడూ ఏయుద్ధానికీ ప్రాణం అర్పించవలసిన అవసరం లేనంతవరకూ ... యుద్ధ పిశాచాన్ని శాశ్వతంగా భూస్థాపితం చేసేంతవరకూ నేను నిద్రపోను. నిద్రపోతుంటేనే యుద్ధరాక్షసి రాజ్యమేలగల్గుతోంది. నిద్రపోతుంటేనే తరతరా లుగా మానవుణ్ణి తన బానిస చేసుకొంటోంది. స్వార్థాన్ని రేకెత్తించి మానవుణ్ణే మానవుడిమీదికి పురికొల్పి మానవుడి చేతనే కూట హత్యలు

చేయిస్తూ మానవాభ్యుదయానికే అభ్యంతరం కలిగిస్తోంది ... ప్రపంచానికిది బోధించి, ప్రపంచంలో యుద్ధంతలపెత్తకముందే ప్రచారంచేసి, అంతా యుద్ధంమాట మరచిపోయేవరకూ, ప్రపంచం నలుమూలలా నిత్య శాంతిశోభలు పచ్చతోరణాలతో ప్రభవిల్లేవరకూ, స్వచ్ఛందసేవావాంఛ, స్వార్థరహిత జీవితప్రవృత్తి, ప్రతివానిమనస్సులో పాదుకునేవరకూ సర్వమానవసమానత్వమే బలంగా...అహింసే ఆయుధంగా అభ్యుదయమే ఆశయంగా, వర్థిల్లేవరకూ యీ శాంతిసందేశం ప్రతిదేశంలో ప్రతిగ్రామంలో, ప్రతి హృదయంలో మారుమ్రోగేవరకూ, యీ 'శాంతి' చల్లనితల్లి వెచ్చనిసందిట్లో మైమరచి మానవుడు నిద్రించగలిగే వరకూ నేను నిద్రపోను ... వెళుతున్నాను తాతా ... యీ జరిగిపోయిన వృత్తాంతాన్ని నువ్వే సమాధిచేసుకో ...

ముసలి:- వెళ్ళునాయనా వెళ్ళు. ప్రపంచంలో కరుడుగట్టిన కఠిన హృదయాలు చాలావున్నై. నీదీనాలాపంలో కఠినత్వాన్ని కరగించి వెయ్యి. ప్రపంచం నలుమూలలా నీకంఠధ్వని ప్రతిధ్వనించేట్లు ప్రచారం చెయ్యి. నీజీవిత లక్ష్యమే ప్రతిమనిషి పరమలక్ష్యంగా పరిణమించేవరకూ తిరిగిరాక ... (సైనికుడు వెళతాడు) ఓనిర్వికల్ప నిర్వికారమూర్తీ! అనేకమంది మహాత్ముల అమర సందేశం అరణ్యరోదనమయి పోయిందింతవరకూ, ఈ సారయినా యీసామాన్యుని కోరిక

సఫలంచెయ్యి... "ఇదేనా ప్రార్థన"
(త్రివ్వటం ప్రారంభించగానే తెర...)



సీనరీ అవసరాలు

ఈనాటకం పూర్తి effects తోనూ, కొన్ని effects తగ్గించీ వేసుకోవచ్చును.

1. వెనక తెల్లని తెర. దానిముందు అడవిచెట్లు దాని ముందు సమాధి bits వరసలు వాటిముందు విడియిటుకలతో పేర్చిన సమాధి వెనక తెల్లతెరమీద నీలం light focus చెయ్యాలి ఆతెరమీదే పైన అక్కడక్కడా నక్షత్రాలు చూపవచ్చు. చంద్రుణ్ణికూడా చూపవచ్చు. నక్షత్రాలు central space లో వుంచవద్దు. అక్కడ మాజిక్ లాంతరు బొమ్మలుపడాలి. ముందు పేర్చిన యిటుకల సమాధి బాంబు పడినవెంటనే శిధిలమయే ఏర్పాటు చెయ్యాలి. సమాధి పేర్చేటప్పుడు ఒక యిటుకను తాడుకట్టివుంచి బాంబుపడగానే లాగివెయ్యాలి.

చంద్రుడు నాటికలో విరామంతెల్పుతూ క్రిమేపీ క్రిందికి దిగుతున్నట్లు చూపవచ్చు

నక్షత్రాలు; చంద్రుడు:- 10, 12 చిన్న చిన్న అట్ట పెట్టెలమీద ఒక ప్రక్క నక్షత్రపు ఆకారం రంధ్రంగా కత్తిరించి పారేసి, ఆ పెట్టెలో ఎలెక్ట్రిక్ బల్బుపెట్టి దీన్ని తెరవెనక అంటించాలి. ఇల్లా అక్కడక్కడా నక్షత్రాలనతికించి wire తో కలిపి వేసే switch ఏర్పరచుకోవాలి. అల్లాగే చంద్రవంక కూడా 3 పెద్ద పెట్టెలమీద కత్తిరించి కుడివైపు పైనుంచి క్రిందకి తెరవెనుక అతికించి మూడింటికీ మూడువేర్వేరు switch లు వుంచుకోవాలి.

Stage ని పూర్తి చీకటి చేసినప్పుడే చంద్రుణ్ణికూడా మార్చాలి. అల్లాగేపావురాన్ని కూడా పెద్దఅట్టపెట్టెమీద వకవలయం కత్తిరించేసి, దానిమీద తెల్ల cellophane అంటించాలి. తర్వాత నీలం cellophane పేపరుమీద పావురం బొమ్మ కత్తిరించి తీసేసి, యీనీలంపేపరు తెల్లవలయంమీద అతికితే పైనీలంకాంతివలయంలో తెల్లనిపావురం వస్తుంది. ఇదివక ప్రత్యేకంగా తెరవెనక అంటించాలి దీనికివేరే switch ఇంతవరకూ చెప్పిన switches అన్నీ Main switch కి సంబంధంలేకుండా separate connection యివ్వాలి Main switch general stage lighting ను control చేస్తుంది.

ఒక్క పావురం తప్ప తక్కిన నక్షత్రాలగోల మానెయ్యవచ్చు. నిజమైన పావురాన్నే వకకర్రకుట్టి సమాధివెనక దాచివుంచి సమయానికి రెండవకోనతో పావురాన్ని ఎత్తి చూపించవచ్చు. Magic lantern తో Alexander మొదలైన slides తెర మధ్యభాగంలో వెనకనుంచి focus చేయవచ్చు. వివిధ కంఠస్వరాలు గల వ్యక్తులచేత ఆయాభాషల్లో ఆయావ్యక్తులమాటలు లోపల్నించి Mic లో మాట్లాడించవచ్చు.

అల్లాగే ప్రతిధ్వనులుకూడా లోపల్నించి 3 వ్యక్తులచేత Mic దగ్గర కుండల్లో మాట్లాడించవచ్చు. వక ప్రతిధ్వని ప్రారంభమవగానే రెండవప్రతిధ్వని తర్వాత మూడవప్రతిధ్వని pitch తగ్గాలి. aeroplane record లు H M V. వారిదగ్గర దొరకుతవి. దాని లోనే బంబార్డుమెంటు రికార్డువుంది. బాంబుపేలటానికీ, తుపాకీకీ మామూలు రోలురోకలే, Magnicium powder ను వెలిగించి flash చూపవచ్చు. విడియిటుకల సమాధిబ్రిద్దలు కావటంతేలికే కావాలంటే stage లోకి పొగకూడా వదలవచ్చు. Technical help తో రిహార్సల్సు జరిగితే యిదేమీకష్టంకాదు.

ఇవ్విలేకుండా వక్క సమాధుల వరసలు బంబార్డుమెంటుమాత్రం వుంచి, Magic latern, నక్షత్రాలూ వగయిరా తీసివేసి కూడా నాటకం ప్రదర్శించారు. రక్తికి భంగంరాలేదు.

ఇంకా వీటి విషయంలో ఏ అనుమానమన్నా వస్తే నాకు వ్రాసి తెలుసుకోగలరు.

గంగాధరరావు.

# డిటెక్టివ్ ప్రథమ ప్రదర్శన:

నటవర్గం:- ప్రసాద్; G. పేర్రాజు. రమణ. భద్రాద్రి శ్రీరామ చంద్రమూర్తి. M. L. N. శాస్త్రి

కల్చరల్ క్లబ్ వారి నటవర్గం.

గంగాధరరావు. N. N. ప్రసాద్ శ్యామ్ సుందర్, రాధాకృష్ణమూర్తి. P. S. తిలక్. రమణ.



నా నాటికల ప్రదర్శింప గోరువారు ముందుగా లిఖిత పూర్వకమైన అనుమతి పొందవలెను.

అనుమతి గోరువారు వలయు తపాలా బిళ్ళలను పంపవలెను.

గంగాధరరావు.

# డిటెక్టివ్

—: స్త్రీపాత్రలులేని హాస్యనాటిక :—

ఈనాటిక యింతవరకూ వివిధ ప్రాంతాలలో, చాలాసమాజాల వారిచేత ప్రదర్శింపబడింది. విమర్శల గౌరవించి కొన్నిసవరణలు కూడాచేశాను.

గంగాధరరావు.

పాత్రలు:—

1) రామం:—
2) రంగనాథం:— విద్యార్థులు; ప్రాణస్నేహితులు, రామం తెలివిగా మాట్లాడతాడు కానికిష్టపరిస్థితుల్లో రంగనాథమే తెలివిగా ప్రవర్తిస్తాడు.

3) యువకుడు:— ఆధునిక యువకుడు; కవిత్వం నేర్చుకుంటున్నాడు.

4) హోటల్ ప్రొప్రైటర్.

5) హోటల్‌లో పనిచేసే కుర్రవాడు.

6) వైద్యుడు:— నాటు వైద్యుడు.

రంగాలంకరణ:- హోటల్లో సింగిల్ రూమ్. వకమంచం దానిమీద hold all పరిచి వుంటుంది. coat hanger గోడకు వుంటుంది. వక చిన్న టేబుల్. టేబుల్ మీదవకపుస్తకం, కాస్తకుంకం. కాగితాలు; అగ్గిపెట్టె. కలం

క్రిందపడేసి వున్న యితరసామగ్రి:- రిబ్బన్ ముక్క మల్లెపువ్వు; hair pin, వెంట్రుక (నల్లదారం), వజ్రం,
ఇవన్నీ చిన్న చిన్న వస్తువులవటంవల్ల రామం పాత్రధారి జాగ్రత్తగా ఏవి ఎక్కడ వున్నాయో స్వయంగాచూచుకోవాలి, తెర ఎత్తేముందు వారూవీరూ నడవటంతో పెట్టుకున్న చోటునుండి అవ్వికదిలిపోవచ్చు అందుకని ఎవర్నీ నడవనియ్యక పోవటమే గాకప్రతి ఈ చిన్న వస్తువూకూడా వకటిపోతే వకటి దొరకటానికి 4. 5 పడేసి వుంచటం మంచిది. ముఖ్యంగా వజ్రం, ఇది చేతులు మారతుందిగనక ప్రతిపాత్రధారి జేబులోనూ 4, 5 వజ్రాలు (పూసలు) జాగ్రత్తగా వుంచుకుని వజ్రంకోసం వెతుకులాడుకోకుండా అవ్వి వుపయోగించుకోవాలి.

కాఫీగ్లాసు. మంచినీళ్ళ బిందెలు-2; దోసెడుపువ్వు, జిగురుసీసా, రామంజేబులో నోటుబుక్కు, 10 రూ॥ ల నోటు; చిల్లర డబ్బులు. యువకునికి చేతిలో వక Letter pad, pen, వైద్యునికి వక bag లోమందుసీసా మొ॥ నవి.



# డిటెక్టివ్

—: హాస్య నాటిక :—

[ఒక హోటల్లో, ఒకగది. రామం గదిలో వక మూల తుకుతున్నాడు. అతని వెనకే రంగనాథం తిరుగుతూ, అతను తికి తీసే ప్రతివస్తువునూ తనూ పరీక్షచేస్తూన్నాడు. రామం క చిన్న రిబ్బన్ ముక్క తీసి]

రామం:- యిదిగో చూశావా(అదిరంగనాథానికిచూపించాడు)

రంగ:- ఏమిటిది?

రామం:- హుఁ. నీకర్థంకాదులే (మరొకవైపు వెతికి ఒక చోటనుంచి నలిగిపోయిన మల్లెపూవు, తీస్తాడు) యిదిగో! యిదిచూశావా?

రంగ:- మల్లెపువ్వు ... ఎండిపోయింది

రామం:- అంతేనీకర్థమయింది (యింకాసేపువెతికి మరోమూల నుంచి ఒకపొడుగాటి వెంట్రుకతీసి) ... ఆఁ! ... (దాన్ని కొలుస్తాడు ... జేబులోంచి నోటుబుక్కు తీసి వ్రాసుకుంటాడు)

రంగ:- ఇదెందుకూ?

రామం:- ఇదంతా వుందిలే

రంగ:- నీకేమన్నా పిచ్చెక్కిందేరా?

రామం:- పిచ్చి...!

రంగ:- లేకపోతే ఏమిటిదంతా— యీవెంట్రుకలూ, యీ రిబ్బన్ ముక్కలూ, ఎండిపోయిన మల్లెపూలు ...

రామం:- (టేబుల్ మీద వెతికి) యిదిగో కుంకం (అని అది పొట్లం కడతాడు)
రంగ:- పోనీ వెతికితే వెతికావ్! ఏమన్నా దొరకచ్చు, కాని అవి పొట్లంకట్టి దాస్తావెందుకూ?
రామం:- (మరోకచోట Hair pin కనబడగా తీసి) యిదిగో విరిగిపోయిన hair pin
రంగ:- నామాటవిని, అట్లా Main road న Railway platform దాకా వెళ్ళిరా. ఎందుకన్నా పనికొచ్చే వస్తువులు దొరుకుతయ్.
రరామం:- అయితేనీవుద్దేశ్యంలో యివ్వెందుకూ పనికిరానివనా?
గం:- పనికొస్తయ్యంటావేం - ఖర్మం !!
రామం:- కాస్త బుర్రవుపయోగిస్తే, చాలాబాగాపనికొస్తయ్
రంగ:- ఆబుర్రేవుంటే నీతో ఎందుకు స్నేహంచేస్తాను.
రామం:- యీ చిన్న చిన్న 5,6 వస్తువులు మనకొక గ్రంథం, ఒక జీవిత చరిత్ర చెబుతాయ్.
రంగ:- ఏడిశాయ్... ఊరికేవాగకు. కొత్తవూరుకూడాను. పిచ్చివాడికిరింద లెక్క కట్టెయ్యగలరు.
రామం:- లాభంలేదురా. నీకు చెప్పినా, లాభంలేదు.
రంగ:- ఇందులో లాభం వకటా!
రామం:- అసలు నిన్ను పుట్టించిన ఆ భగవంతుడిది తప్పు. నిన్ననేం ప్రయోజనంలేదు.
రంగ:- ఏం ?ఏం తప్పుచేశాడు.
రామం:- అందరికీ బుర్రనిండా పెట్టిన మెదడు రెండు భాగాలుగా పెట్టాడు. ఇటొకభాగం - అటొకభాగం నీకు

ఒక వైపే పెట్టి వూగుతున్నాడు. రెండో వైపేం లేదు. కాబట్టి నీకు యివతల వాడేమంటున్నదీ చచ్చినా బుర్రకెక్కదు.

రంగ:- ఏడిశావ్

రామం:- వాదనలో అవతలవాడనేది చస్తేవినవ్. విన్నా- అర్థం చేసుకోవ్.

రంగ:- ఏడిశావ్ లేవోయ్, నీలెక్కప్రకారమయితే ప్రపంచంలో సగం ముప్పాతిక మందికి రెండో వైపు మెదడు వుండదు, ఒక్కినా కేమిటి...?

రామం:- ఇప్పుడీ రిబ్బన్ ముక్క, మల్లెపువ్వు, యీ శిరోజం, యీకుంకుమ, తలపిన్ను - నాకు దివ్యమైన భోగట్టా యిచ్చాయ్.

రంగ:- ఎందుకొచ్చిన భోగట్టా అంటా.

రామం:- అదే నీదగ్గర వున్నది. సుందరంగాడికోసం మనం యీవూరు వచ్చాం. వాడువూళ్ళో లేడు వాడువచ్చే దాకా పనీపాటా లేకుండా యీవూళ్ళో యీహోటల్లో గడపాలి. కనక, యీరెండురోజులూ యిటువంటి డిటెక్టివ్ పని పెట్టుకుంటే తేలిగ్గా వుబుసుపోదూ.

రంగ:- డిటెక్టివ్ పని ప్రారంభించా! ఎప్పట్నుంచీ?

రామం:- అదిగో, ఆనవల చదివిన దగ్గర్నుంచీ.

రంగ:- (టేబుల్ మీద పుస్తకం చూపిస్తూ) ఇదా?

రామం:- ఆఁ ఆదే. తగలేశాడు చివరకి. వాడిచ్చిన Clues తో, బుద్ధిముండకూడా కనుక్కుంటుంది. గొప్పగా వ్రాశాడు

రంగ:— వీటిల్లో ఏదన్నా గొప్పసంగతి, అప్పుడే కనిపెట్టేశా వేంరా — నాతో చెప్పకండా?
రామ:— నేకనిపెట్టేదేమిటి? యీ ముక్కలన్నీ వాటంతటవే చెబుతుంటే.
రంగ:— యివన్నీ? — నీకెప్పుడు చెప్పాయిరా?
రామం:— (నవ్వి) నేనేమో అనుకున్నాగాని — నీకావొక్క వైపు మెదడుకూడా లేదురా.
రంగ:— ఏడిశావ్ లే. ఒక వైపు తప్పకుండా వుండేవుంటుంది.
రామం:— వీటినన్నిటినీ చూస్తుంటే అర్థం కావటంలే
రంగ:— నిజంగా అర్థంకాలే.

రామం:— ఈ చిన్న చిన్న వస్తువుల నాధారం చేసుకుని మనం పెద్దభోగట్టా సంపాదించవచ్చు. పెద్దపెద్ద హత్యలన్నీ చిన్న చిన్న యిలాంటి వస్తువులతోనే, చాలా మంది కనిపెట్టారు. మొట్టమొదట యీమల్లెపువ్వు, కుంకుమ, ఏంచెబుతాయంటే ... (రంగనాధాన్ని వకసారి చూచి) భయంలేదులే. గాభరాపడకు — యీ గదిలో, యిక్కడ, మనం రాకపూర్వం— ఒక స్త్రీ- వుండి వెళ్ళిందీ- అనిచెబుతున్నయ్.
రంగ:— నీమొహంలావుంది. హోటలు అన్నతర్వాత ఎవరో ఒకరు వుంటారు. మల్లెపూలు ఆడవాళ్ళే పెట్టుకుం టారు.దీంట్లో విశేషమేముంది?
రామం:— అదేతెలివంటే. యీమల్లెపువ్వు ఏం చెబుతోం దంటేఆమె రాత్రింతా యిక్కడేవుందని చెబుతోంది.

రంగ:— అది చెబితే చెప్పిందికాని, కాస్త జ్ఞానముంటే. నువ్వలా చెప్పక.

రామం:- ఏం?

రంగ:— ఆడవాళ్ళు పగలూ పూలు పెట్టుకుంటారు.

రామం:— (తన బుర్ర చూపిస్తూ) నీకిక్కడేమీ లేదు. ఖర్మం. ఆడవాళ్ళు పగలు పెట్టుకున్న పువ్వు కిందపడితే వాడిపోవచ్చు, కాని, యిట్లా నలిగి అప్పచ్చి అయిపోదు.

రంగ:— అవునురోయ్. ఇది పాయింటే.

రామం:— కుంకం పెట్టుకుందికాబట్టి పునిస్త్రీ అయివుండాలి?

రంగ:— "అయివుండాలి" అని అంత ధీమాగా అంటావేమిటి?

రామం:- నువ్వు కాదంటావా?

రంగ:— అంటే, అంటాను.

రామం:— ఎలా అనగలవ్. కుంకం పెట్టుకుంటే...

రంగ: పోరా — చాలామంది వితంతువులూ కుంకం పెట్టుకుంటున్నారు.

రామం:- నీకేమని చెప్పారా?

రంగ:— ఆమె పునిస్త్రీ అన్నావ్.

రామం:- అంతకుముందు? రెండో సైడు లేదన్నానా?

రంగ:— ఒకసారేం, చాలాసార్లన్నావ్.

రామం:— ఆమాటనిజం, అక్షరాలానిజం. విధవైనా బొట్టు పెడితే పునిస్త్రీ కాదూ?

రంగ:- నిజమేరోయ్

రామం:— కాబట్టి ఆస్త్రీ కిందటిరాత్రంతాయీగదిలోనేవుంది

రంగ:- వుండేమో!!

రామం:- ఒప్పుకున్నావా?

రంగ:- ఆc——రిబ్బన్ ముక్క, hair pin ఆమెవే.

రామం:- yes. యిప్పుడిప్పుడే నీకాస్త తెలివి పుడుతోంది సరే! యిక యీ శిరోజం ఏంచెబుతోందయ్యా అంటే:

రంగ:- నావెదం. అదేంచెబుతుంది, చెపితే నువ్వే చెప్పాలి.

రామం:- (వెంట్రుక చేత్తో చూపిస్తూ) యిది నల్లగావుంది కనుక, ఈ స్త్రీ చాలాయౌవ్వనంలో వుందనీ, యీ వంకరలను బట్టి ఆమె చాలా అందమైనదనీ:-

రంగ:- ముసలివాళ్ళకు మాత్రం నల్లవెంట్రుకలుండవుటా?.

రామం:- (విసుగ్గా) ఓరేయ్, నువ్వువిను. వంకర ప్రశ్నలు వెయ్యకు.

రంగ:- సరే

రామం:- సరే- యిరవై లేక ముప్ఫై ఏళ్ళదయి ఉంటుందని తెలిసింది. ఇకయీరిబ్బను? ...ఎల్లా ఉందోచూడు.

రంగ:- ఎల్లాఉందీ - చిరిగిందీ

రామం:- చిరిగింది. కత్తిరించలేదు. యీ hair pin?

రంగ:- విరిగింది

రామం:- విరిగింది. మరియింకేంచెబుతున్నయ్?

రంగ:- యివీ ఏమోచెబుతాయిరా? -చిరిగి, విరిగినా

రామం:- ఆ- యీరెండూ కలసి చెప్పేదేమిటంటే, యీ సుందరాంగి ఏకారణంవల్లో, ఎవరితోనో పెనుగులాడిందనీ, - ఆకొట్లాటలో యీరిబ్బన్ చిరిగిందీ. యీపిన్ను విరిగింది అనీ-

రంగ:- నీ తెలివి తేటలకి నేను సంతోషించాగాని యిక వూరుకో. ఎవరన్నా వింటే చెప్పుచ్చుకు కొడతారు.

రామ:- యేమంటావ్?

రంగ:- లేకపోతే ఏమిటిరా. అర్ధరాత్రిపూట, ఏఆడది, ఎవరితో కొట్లాడుతుంది-వంటరిగా? ఏం ప్రపంచజ్ఞానండుండక్ఖర్లే.

రామం:- నాకు ప్రపంచజ్ఞానం లేకపోయినాసరే గాని ఆమెవ జ్ఞానం లేకుండా దెబ్బలాడేసింది! ఆమాట నిజం. నువ్వు నమ్మితీరాలి.

రంగ:- పోనీలే. నువ్వు చిన్న బుచ్చుకోకు. నేను నమ్ముతాను. అయితేమాత్రం నువ్వుయింతా ఆలోచించి తేల్చేది "ఆమె ఎవరితోనో దెబ్బలాడింది" అని. అంతేగా?

రామం:- అంతేనా? ఎందుకు దెబ్బలాడింది. దెబ్బలాట యేమయింది: ఎవరెట్లా గెలిచారు. ఇవన్నీ తేల్చాల్సిన విషయాలు [యింతలో ఒకయువకుడు వచ్చాడు. జుట్టుబాగా పెరిగి గిరజాలకు తక్కువగా ఉన్నది. సిల్కు లాల్చీ గ్లాస్కో పంచ Rimless కళ్ళజోడు కాబూలీ shoes ఉన్నయ్. లేనివి-మీసాలు]

యువ:- Excuse me sir. Iam sorry కాని ఒక్క విషయం అడగాలని వచ్చాను. "కృష్ణవేణీ సరిత్తుంగ తరంగాలపై" అన్నారుగదా- ఆఅన్నవాళ్ళు ఆనకట్ట ఎగువవైపుచూశిఅన్నారా, దిగువవైపుచూశిఅన్నారా

రంగ:- దిగువవైపు.

రామం:- ఏడిశావ్. ఎగువవైపు.

యువ:- ఆ. ఎగువకైపే అయివుండాలి. సరే, వస్తా. [వెళ్ళాడు]
రంగ:- ఈయన యెవరు?
రామం:- ఎవరో అవతలగదిలో ఆయన. ఎవరయితేనేమంలే. మనసంగతి తేల్చు
రంగ:- మనసంగతీ? ఏదీ-?
రామం:- యీరిబ్బను, మల్లెపువ్వు.
రంగ:- వాటిదుంప తెగిరి. ఆమె ఎవరో దెబ్బలాడితే మన కెందుకు లేద్దూ
రామం:- అలాఅనకు. ఆనిరాశ నిరూపకుడికి అసలుపనికిరాదు
రంగ:- నువ్వన్నట్లుగా ఎవరన్నా ఒక "అందమయిన" లేక "అందవిహీన" స్త్రీ, యీగదిలోవుండి వెళ్ళివుండ వచ్చు. ఆమె ఏకారణంవల్లనో ఎవరితోనో దెబ్బలాడి ఉండవచ్చు. ఈ మాత్రం కనుక్కోవటానికి నీ తెలివి తేటల్ని వృథా చెయ్యటమెందుకు-
రామం:- ఒక దెబ్బలాట అయితే ఫరవాలేదు. కాని అదే యింకేదన్నా ............
రంగ:- యింకేమన్నా అవటానికి ఏముంది?
రామం:- ఏమన్నా హత్యో చోరీయో, ఏమో.
రంగ:- ఏమో ఏదోఒకటి. యీ ప్రపంచంలో. యింతమంది పనిలేకుండా తిరుగుతుంటే అందరికీ అక్కర్లేనిది మన కెందుకూ,
రామం:- మనబోటివాళ్ళు మన కెందుకని ఊరుకుంటుంటే నే యీ హంతకులూ, దొంగలూ, రౌడీలూ యిట్లా విరగబడి

పోతున్నారు.

రంగ:- అయితే యిదేదో తేల్చి తీరాల్సిందేనా?

రామం:- ఎంత శ్రమ కోర్చిఅయినాసరే.

రంగ:- ఆ-

రామం:- ఎంత ఖర్చయినాసరె.

రంగ:- చెప్తేవినవ్?

రామం:- చచ్చినాసరే.

రంగ:- ఊ. నిన్నని ఏంప్రయోజనంలే. తప్పంతా అనవసరంగా నీకు రెండువైపులా మెదడు పెట్టిన బ్రహ్మదేముడిది.

రామం:- నేనదీనికి పూనుకోడానికి అదే ప్రథమకారణం

రంగ:- ఏమిటి

రామం:- నామేథాశక్తిని యిక అనవసరపు ఆలోచనలతో ఖర్చుచేయకుండా యిటువంటి వాటిల్లో కల్పించుకుని-

రంగ:- ఆ- కల్పించుకుని-?

రామం:- పుణ్యం, పురుషార్థం... Name, Fame సంపాదిస్తాను

రంగ:- డబ్బుఅడక్కుండా.

రామం:- అవసరమైతే సొంతడబ్బు ఖర్చుపెట్టి...

రంగ:- మీ బాబాయిని మర్చేపోతున్నావ్-

రామం:- పోరా, ఇంతఖ్యాతి వస్తూంటే - ఇంకా బాబాయ్ అంటావ్.

రంగ:- ఏడిశావ్ నేనుండగా నీకు రానిస్తానేం, ఖ్యాతి.

రామం:- ఏంచేస్తావ్.

రంగ:— నీ సంగతీ, నీసుందరాంగి సంగతీ తేల్చేస్తాను.

రామ,— ఈ బుర్రతోనే—

రంగ:— ఆ— చూస్తూవుండు. అరే కుర్రాడా?

రామం:— (ఇంతలో వకమూల ఏదో చూసి) ఆగు

రంగ:— ఏం?

రామం:— అదేమిటో మెరుస్తోంది.

రంగ:— ఎక్కడ?

రామం:— ఆమూల [యిద్దరూ వెళ్ళి అదితీసి, చూస్తారు]

రామం:— ఏదోరాయి.

రంగ:— బాగా మెరుస్తోంది.

రామం:— మంచి వజ్రంలాగవుంది.

రంగ:— అవును.

రామం:— ఇది ఆమెదే అయివుండాలి.

రంగ:— తప్పకుండా

రామాం:— అయితే తప్పకుండా ఆమె ఎవరో తేల్చుకోవాలి

రంగ:— ఎందుకూ!

రామం:— ఇది ఆమె కివ్వొద్దూ?

[యువకుడు మళ్ళావస్తాడు]

యువ:— Excuse me sir, కాని ఒక్క సంగతి— ఏమండి "వజ్రకాయం" అనటంలో "కాయం" — అదేశరీరం— వజ్రంలాగా గట్టిగా ఉంటుందనా— వజ్రంలాగా మెరుస్తుందనా?

రామం:— మెరుస్తుందనే!

యువ:- you are correct. వస్తా [వెళ్తాడు]

రంగ:- ఒరేయ్.

రామం:- ఏం?

రంగ:- నీకేదో, కాస్త బుర్ర ఉండేదిగాని పూర్వం, అది పోయిందిరా.

రామం:- ఏం?

రంగ:- "వజ్రకాయము" అంటే మెరుస్తుందనా ?

రామం:- ఏడిశావ్ లేవోయ్ - వాడికి చెప్పాలనే తప్పు చెప్పాను.

రంగ- ఆ!! (తెల్లబోతాడు)

రామం:- వాడిసరుకెంతో కనుక్కుందామని-

రంగ:- నిజంగా (అని నోరు తెరుచుకొని ఆశ్చర్యంతో నిలబడి పోతాడు)

రామం:- మంచినీళ్ళు కావాలా?

రంగ:- ఆ-

రామం:- Boy ని పిలవనా? మంచినీళ్ళు తెప్పిద్దాం.

రంగ:- ఊ-

రామం:- ఒరేకుర్రాడా- ఒరేయ్ [అని పిలవగా కుర్రవాడొచ్చాడు]

కుర్ర:- ఏం సార్ - పిలిస్తిరి,

రామం:- కాసిన్ని మంచినీళ్ళు పట్టుకురా (వాడు వెళ్ళబోగా)

రంగ:- ఆగు. (కుర్రవాడు ఆగగా) యీగదిలో, నిన్నరాత్రి, మేము రాకపూర్వం- ఎవరున్నారు?

కురర్రి:- ఎన్నాతకిసార్?
రంగ:- ఏదో ఒక "అన్నాతకి". చెప్పు
కురర్రి:- రూంబు బాగా ఉండిందిలేదాసార్?
రంగ:- రూమ్‌కేం! బాగానేవుంది.
కురర్రి:- గాలి వరాదనా సార్?
రంగ;- ఏడిశావ్. అడిగిందానికి చెప్పవోయ్?
కురర్రి:- యెందుకో చెప్పండిసార్?
రంగ:- పనుంది చచ్చేపనుంది. అసలుసంగతి చెప్పవేం!
కురర్రి:- ఆండవనే!!! చచ్చేపనే?
రంగ:- ఆ-చచ్చేపనే! ప్రాణం ఎగిరిపోయేపని
కురర్రి:- కడవలే!!! (ఖంగారు పడ్తాడు)
రామం:- (రంగంలో) అదిగాదురా. ఆగు (కురర్రితో) ఒరేయ్!
నువ్విట్రారా.
కురర్రి:- సార్- (దగ్గిరకెళ్తాడు)
రామం:- యీగదిలో మేమురాకముందు ఒక స్త్రీ - అంటే-
ఆడది- ఉందిగదూ
కురర్రి:- ఆమా సార్.
రామం:- ఆమె 20-30 సం॥రాల మధ్య వయస్సులో
ఉంటుందికదూ
కురర్రి:- ఆమా సార్.
రామం:- ఆమె చూపులకి చాలా అందంగా చలాకీగా ఉం
టుందిగదూ
కురర్రి:- నిజంసార్; రొంబ చలాకీ

రామం:- నిన్నరాత్రి, మల్లెపూవ్వులూ, నీలం రిబ్బనూ, పెట్టు
కుంది కదూ?

కుర్రి:- ఉండిందిసార్; మల్లెపువ్వులు నేనే తెస్తిని

రామం:- ఇక చెప్పు ఆమెవెంట్రుకలు పొడుగ్గా రింగులు తిరిగి
ఉంటయ్ కదూ?

కుర్రి:- ఆసంగతి మీకెందుకు సార్?

రామం:- ఎందుకయితేయేం చెప్పు. ఆ శిరోజాలు తుమ్మెద
రెక్కల్లాగా నల్లగా, పొడుగ్గా, ఉంటయా? లేదా?

కుర్రి:- ఉంటయ్ సార్.

రామం:- ఆమె చేతి ఉంగరానికి పెద్దవజ్రంఉందా, లేదా?

కుర్రి:- (తెల్లబోయి) మీకెప్డి తెలుసును సార్.

రామం:- తెలుసునులే. చెప్పు.

కుర్రి:- ఆమెమీకు తెలుసునాసార్.

రామం:- తెలియదులేచెప్పు. చేతి ఉంగరానికి పెద్ద వజ్రం
ఉందా లేదా?

కుర్రి:- ఉండిందిసార్ కాని దాని సంగతి నాకేమి తెలియదు
సార్.

రామం:- వజ్రం సంగతా?

కుర్రి:- ఆమా సార్.

రామం:- ఆవజ్రం పోయిందా?

కుర్రి:- అయితే పోలేదా సార్.

రామం:- లేదు. పోలేదు. దాన్ని ఎవడో దొంగిలించాడు.

కుర్రి:- అదే సత్యం; సార్.

రామం:_ఒకడెవడో_నిన్నరాత్రి గదిలోకి వచ్చి అది కొట్టేసి వెళ్ళి ఉండాలి.

కురబ్రి:- రాత్రి నేనూ వింటినిసార్. గదిలోపల ఏదో గలాటా జరిగింది, ఒక గంటసేపూ.
రామం:- చూశావురా! రంగనాథం.
రంగ:- ఆ- కనిపిస్తూనేవుంది.
రామం:- ఆగలాటా అంతా ఏమంటావ్
రంగ:- ఏమనను?
రామం:- దీని సంగతి తేలిపోయింది - రాత్రి యీ గదిలో జరిగింది "చోరీ".
కురబ్రి:- చోరీయేసార్ - చోరీయే.
రామం:- ఆమె యిక్కడుండగా, ఎవరోవచ్చి ఆమెనగలన్నీ దోచుకున్నాడు.
కురబ్రి:- 'ఎల్లాం' దోచుకున్నాడు సార్ - ఒక్క Ring తప్ప.
రామం:- ఆరింగులో రాయితప్ప, ఉంగరం కూడా తీసుకెళ్ళాడు
కురబ్రి:- కాదుసార్. ఉంగరం సర్కిల్ Inspector తీసుకపూడ్చాడు.
రంగ:- సర్కిల్ ఇనస్పెక్టరా-!!!
కురబ్రి:- ఆమాసార్ - రాయిదొరక లేదు. ఉంగరం దొరికింది
రామం:- అహా-
కురబ్రి:- ఉంగరం చేతికి బిగుసుకుపోయింది. ఉంగరంలో రాయి మాత్రం కనిపించ లేదు.

రామం:- అదీసంగతి- ఆరాయి గలాటాలో ఊడిపోయుం టుంది. దొంగ ఉంగరంరాక వదిలేసి పోయాడు.
కుర్రి:- వాడువూరికే వదలలేదుసార్-లాగటానికి ప్రియత్నం చేసి విడిచాడు. ఆమెచేతికిగాయం అయివుండింది. అది బాగా బిగిసిపూడ్చి రాకుండాపోయిందిసార్
రామం:- ఉంగరం వ్రేలికి బిగుతుగా వుంది కాబోలు
కుర్రి:- ఆమా సార్
రంగ:- పాపం ఆమెకు బాగా దెబ్బలు తగిలాయ్ కాబోలు
కుర్రి:- వేరేం దెబ్బలేదుసార్. వేలికి ఒకగాయం, మెడకాయ మాత్రిం నలిగి, బాగా వాచి ఉండింది.
రామం:- మెడకాయ గట్టిగా పిసికాడు కాబోలు.
కుర్రి:- మరి పిసకలేదాసార్. గట్టిగా పిసికి విడిచినాడు.
రంగ:- అంతగట్టిగా పిసికితే ప్రాణంపోదూ?
కుర్రి:- మరి పోదూసార్.
రంగ:-
రామం:- } అయితేపోయిందా?
కుర్ర:- అప్పుడే పోయిందిగాసార్-
ప్రొద్దునే Report చెప్పితిమి. పోలీసులువచ్చి మమ్మల్నందర్ని దుంపతేంచాశారు.

యిద్దరు:- అహా
కుర్రి:- యింతవరకూ దొంగ దొరకనేలేదుసార్, ప్రాపర్టీ కూడా దొరకనేలేదట.
యిద్దరూ:- ఊ

కురర్రా:- ఒక్క Clue కూడా దొరకలేదట సార్
యిద్దరూ:- ఆ
కురర్రా:- ఆరాయికోసం వెతికారుసార్.
యిద్దరు:- ఊ
కురర్రా:- అది దొరికితే దొంగ దొరికినట్టేట్టసార్.
యిద్దరు:- అహ
కురర్రా:- దానికోసంపెద్ద Investigation చేస్తుండిరి.
యిద్దరు:- ఓహో!
కురర్రా:- ఊరంతా ఉదయంనుంచీ పెద్దగోలగా ఉండింది.
రంగ:- అలాగా !!!
కురర్రా:- అప్పుడుసార్ - మీకు C. I. D. తాలూకాసార్.
రామం:- ఊ
కురర్రా:- అహా కాదు.
కురర్రా:- మరి ఎందు కడిగారుసార్ యివన్నీ-
రామం:- ఏవి?
కురర్రా:- ఈ మల్లెపూలూ అవీగురించి-
రామం:- అడిగితేఏం?
కుంరర్రా:- ఏంలేదుసార్ C. I. D. పూరా work చేస్తుండిరి.
అందుకుదా అడిగితిని.
యువ:- [ప్రవేశించి] Excuse me Sir ఒక్కమాట వజ్రాల సంగని మీకు బాగా తెలుసునల్లేఉంది. వజ్రాలకి వైడూర్యాలకి భేదం ఏమిటి?
రామం:- అట్టేభేదం ఏముందీ?- కాస్త మెరుపులోతేడా అంతే!

యువ:- అంతేనా? అయితే వజ్రింబదులు వైఢూర్యంవాడ
వచ్చునన్నమాటే.

రామం:- ఆ

యువ:- సరే - వస్తానండి [వెళతాడు]

రంగ:- వీడెవడ్రా.

రామం:- ఆవతల Room లో వాడు

కుర్ర:- ఆమాసార్ - అవతల రూమ్‌లో మీకు ముందే
దిగారు. నేనువస్తామసార్.

రంగ:- ఊఁ- పో

కుర్ర:- [వెళ్ళబోయినవాడు తిరిగివచ్చి రాంతో] ఆరూము
లో ఆయనమీకు తెలుసునాసార్,

రామం:- తెలియదు- ఏం?

కుర్ర:- తెలియకపోతే సరెసార్ ఏంలేదు CID ఏమోనని
[వెళతాడు]

రామం:-}
రంగ:- } [ఒక్కసారిగా ఒకళ్ళ నొకళ్లు అడుగుతారు]

రామం:- ఏమిట్రా?

రంగ:- వీడు C. I. D యా?

రామం:- [అనుమానంగా] C. I. D ఏ అంటావా?

రంగ:- అంటావా ఏమిటి? వాడేఅయిఉంటాడు,

రామం:- C. I. D అంటే ఏలాఉంటాడు.

రంగ:- వాడిలాగానే ఉంటాడేమొ.

రామం:- అయితే వీడే C. I. D అయిఉంటాడంటావా?

రంగ:- అయ్యే ఉంటాడు

రామం:- అయ్యేఉంటాడు! పైగా వజ్రాలసంగతి అడుగు
తున్నాడు.
రంగ:- అవును ఆవజ్రంకోసమే వీడు వెతుకుతున్నాడు.
అవజ్రంద్వారా దొంగల్ని పట్టుకోవాలని కాబోలు
ఆవజ్రం మనదగ్గరేవుంది.
రామం:- నాదగ్గిర!! (జేబు తడుముకుంటాడు)
రంగ:- అదిమనదగ్గర ఉందని కనిపెట్టేశాడు వీడు
రామం:- అందుకనేకాబోలు "మీకు వజ్రాలసంగతి బాగా
తెల్సుల్లే ఉంది" అన్నాడు.
రామం:- ఏమోరా C. I. D లు మారువేషాల్లో తిరుగు
తున్నారట.
రంగ:- తిరుగుతారూ?
రామం:- ఆ పుస్తకంలో C. I. D మారువేషంలో తిరుగాడు
మరి (కాస్త భయంగా)
రంగ:- తిరిగాడూ (వణుకుతాడు)
రామం:- వణుకుతావేంరా?
రంగ:- నాకేదో దడపుడుతుందిరా.
రామం:-నిజంగానేనా? నాకు నిజంగానే దడపుడుతోంది.
రంగ:- నాచేతులు వణికి పోతున్నాయ్.
రామం:- ఆవజం్రి నాజేబులోఉంది.
రంగ:- నువ్వన్నానాకు ధైర్యం చెప్పవేరా?
యువ:- [ప్రవేశించి] Excuse me sir, కాని ఒక్క సంగతి.
స్త్రీ ధనాన్ని దొంగిలించినవాణ్ణి ఏమంటారూ

రంగ:- ఉత్త వెధవ అంటారు.

యువ:- ప్రత్యేకంగా ఏదైనా మాటవుందా 'స్త్రీధనచోరుడు' లాంటిది. కాస్త తెలిస్తే చెప్పండి.

రంగ:- మాకేం తెలియదయ్యా - ఆసంగతి.

యువ:- [రామంతో] మీకండీ!

రామం:- నాకసలు తెలియదండీ.

యువ:- [నిరాశగా] పోనీలెండి - వస్తా [వెళతాడు]

రంగ:- రామం ???

రామం:- కనిపెట్టేశాడురా.

రంగ:- వీడువజ్రంకోసమే వెతుకుతున్నాడు

రామం:- అదిమన దగ్గర ఉందని కనిపెట్టాడు.

రంగ:- ఇక పోలీసుల్ని తీసుకొచ్చి మనల్ని పట్టిస్తాడు.

రామం:- మరిఏంచేద్దా

రంగ:- అదే- ఏం చేద్దాం.

రామం:- యీవజ్రం ఎక్కడన్నా పారేసేద్దాం. [అని కిటికీ లోంచి -తనదగ్గరున్న వజ్రం పారెయ్యబోతాడు]

రంగ:- ఆగు; నీక్కాస్త బుర్ర ఉందని ఒప్పుకొంటాగా అది అవసరమైన విషయాల్లో ఉపయోగించవ్

రామం:- ఏం?

రంగ:- అదల్లా పారెయ్యటం ఎవరన్నా చూస్తే-

రామం:- మరెట్లా?

రంగ:- పొట్లాంకట్టి దూరంగాపారెయ్యి.

రామం:- ఆహా [అల్లాగే పారేశాడు]

రంగ:- అమ్మయ్య

రామం:- యిహ ఫరవాలేదు. ఎంతమంది C. I. Dలు వచ్చినా ఫర్వాలేదు.

రంగ:- హాయిగా నిద్దర పోవచ్చు. యిక కాస్సేపు నిద్రపో- యిల్లాంటి పిచ్చిపనులు యిక చెయ్యాను. [కాఫీ కప్పులు తీసుకొని కుర్రాడు వస్తాడు]

కుర్ర:- సార్. సార్ సార్- ఆయన సి. ఐ. డీ. టండి-

రంగ:- ఎవరన్నారు?

కుర్ర:- మావాళ్ళే అంటున్నారు.

రామం:- అయితేఏం, మమ్మల్ని ఏం చేస్తాడు. ఏరా?

రంగ:- ఆహా( మననేం చేస్తాడు- అవును.

కుర్ర:- ఏమోనండీ- మా అందరిక్కీ నిండా భయంగావుంది. యెవరి మీద కొస్తుందో? వాళ్ళకనుమానం తగిలితే ముందుగా చావగొడతారు సార్.

యిద్దరూ:- ఆ!-

కుర్ర:- నేవస్తా సార్. (వెళతాడు)

రామం:- పో [వాడు పోతూవుండగా యువకుడు ఎదురు వస్తాడు.

యువ:- Excuse me sir, -కాని మీరు శకుంతల చదివారా?

రంగ:- లేదండీ.

రామం:- ఎందుకండీ.

యువ:- కాస్త కావాలిలెండి- దాంట్లో ...?

రామం:- దాంట్లోమున్నా చదవలేదండీ.

యువ:- అరె...చదవలేదండీ
రామం:- లేదండీ.
యువ:- [యువకుడు వెళ్ళబోయి- ఆగి] ఆ! మీదేవూరండీ?.
రామం:- ఈవూరుకాదు లెండి.
యువ:- అహ ఎందుకొచ్చారిక్కడికి?
రంగ:- ఊరికినే.
రామం:- ఆహా! ఒక Friend తో, పనుండివచ్చాం
యువ:- అ Friend యీ హొటల్లో దిగాడా?
రంగ:- కాదు, వాడు యీవూరువాడే
రామం:- వాడు వూళ్ళోలేడట అందుకని మేము హోటల్లో దిగాల్సివచ్చింది.
రంగ:- రెండురోజులు తర్వాతగాని రాడట; అందుకనియిక్కడ వున్నాం .యిక్కడేవుంటాం రెండురోజులదాకా.
రామం:- కూర్చోండిసార్, మర్చిపోయాను.
యువ:- [కూర్చొని] ఆయనతో మీకు ఏంపని.?
రంగ:- ఆహా పెద్దపనేం లేదులెండి - అయితే మీకేంపని లేదూఅవతల-,?
యువ:- లేదులెండి; రెండురోజులు ఉంటారా.
రామం:- ఉంటాం- ఎక్కడికీపోము.?
రంగ:- ఎక్కడికి పోయినా మీకు తెలియకుండాపోము.
యువ:- (ఎదో జ్ఞాపకం వచ్చి హాఠాత్తుగా లేచి) వస్తాసార్; ఒక idea తట్టింది. [వెళతాడు]
రామం:- వెధవ! మన దగ్గిర భోగట్టా లాగటానిక్కవచ్చాడు.

రంగ:- యేదో Idea తట్టింది- అంటాడేమిటి.

రామం:- ఏడిశాడు.

రంగ:- అల్లా అనకు వీడేదో ప్లాను వేస్తున్నట్లున్నాడు.
[కుర్రవాడు ప్రవేశించి] కిటికీలోంచి ఏదో పొట్లం పడింద్టసార్- మావాడు చూచి నాకిచ్చినాడు.ఇదిగో [అనిరామానికి పొట్లంయిస్తాడు]

యిద్దరూ:- [తెల్లబోతారు]

రామం:- [తెప్పరిల్లి పొట్లంతీసుకుని] అదా - రంగనాథం పొట్లాంగట్టి జాగ్రత్తగా ఉంచాలిగాని యిలాపారేస్తావేంరా?

రంగ:- నేనూపారేశానూ!!

రామం:- ఇంద- జాగ్రత్తగాదాయి.

రంగ:- వద్దు!!!

రామం:-వద్దంటావేం వస్తువు జాగ్రత్తగా దాయటం నేర్చుకో యింద [అని జేబులో పడేస్తాడు]

కుర్ర:- వస్తాసార్. అంతా గడబిడగావుంది [వెళతాడు]

రంగ:- ఎల్లారా దీన్ని వదిలించుకోవడం.

రామం:- దాందేముంధిలే దాందేముందిలే- ఎల్లాగో అల్లా వదిలిద్దాం

రంగ:- అందుకేనాకు వళ్ళుమండేది. అది నెమ్మదిగా నా ముఖాన పారేసి- వూరకే కబుర్లు చెబుతావ్

రామం:- అంత విసుక్కుంటావేరా?

రంగ:- విసుగుకాదూ! యిది నీజేబులో వుంచుకు మాట్లాడూ, చూద్దాం- విసుగొస్తుందో లేదో?

రామం:- నీజేబులోవద్దు, నాజేబులోవద్దు, దానిసంగతి ఆలోచించేశాను.

రంగ:- అప్పుడే?

రామం:- మరేమనుకొన్నావ్! దీన్ని ఒకపార్సిల్ కట్టి పోస్టులో పంపించేద్దాం.

రంగ:- ఎక్కడికి?

రామం:- ఎక్కడికో - అక్కడికి. వెధవప్రశ్నలువెయ్యొకు-ఆ! అగ్గిపెట్టెయిలా యియ్యి [గబగబా అగ్గిపెట్టె యివ్వగా, వజ్రిందాంట్లో పెట్టి] ఆకుర్రివాణ్ణి అడిగి కాస్త జిగురు పట్టుకురా [రంగనాథం జిగురు కోసం వెళతాడు. రామంపార్సిలు కడతాడు. రంగనాథం జిగురుతేగా, అంటించి పార్సిల్ చేసి అడ్రస్ వ్రాసి కుర్రివాణ్ణి పిలుస్తాడు] [వాడురాగా]

రామం:- ఒరేయ్ యిది పోస్టులో పడేసిరా [వాడు తీసుకెళతాడు] చూశావా. ఈమాత్రం దానికి పెద్ద బ్రహ్మాండం చేశావు.

(కుర్చీలో కూర్చుంటాడు)

రంగ:- ఒప్పుకున్నానురా.

రామం:- ఏమని?

రంగ:- నీకు రెండువైపులా బుర్రవుందని.

రామం:- ఆ; అట్లా ఒప్పుకో; ఇక యీ సి. ఐ. డి. గాళ్ళని రమ్మను చూస్తా. ఆ కాస్త వక్కపొడి యిట్లాపెట్టు.

రంగ:- ఆ.. (వక్కపొడి జేబులోంచి తీసిపెడ్తూ) అయితేఎవరి అడ్రసు వ్రాశావు?

రామం:- యింతవరకు పుట్టని - యిక పుట్టబోని వాడి ఆడ్రెస్ వ్రాశా.

రంగ:- అయితే ఫర్వాలేదు. చస్తేవాడికందదు.

యువ:- [వస్తాడు] ఏమండీ యీసంగతి మీకు తెలుసా? నిన్న యీగదిలో ఎవరో చనిపోయారట.

ఇద్దరు:- [ తెల్లబోతారు]

రామం:- ఏమంటారూ?

యువ:- ఎవరో యీగదిలో నిన్న హత్య చెయ్యబడ్డారని విన్నాను.

రామం:- ఆ (తడబడుతూ) ఆ అదీ నేనూ విన్నాను

యువ:- ఆ సంగతేమన్నా తెలుసామీకు?

రామం:- తెలియదు.

రంగ:- తెలుసు.

రామం:- (తెల్లబోయి) ఆ !!!

రంగ:- ఆ నిన్నరాత్రి - అప్పటికి మేమురాలేదు. ఒక స్త్రీ 20:30 ఏండ్ల మధ్యవయస్సు- అందమయినదీ - నల్ల జుట్టు;

యువ:- ఆ అ-

రంగ:- నీలం రిబ్బను - మల్లెపూలు - చేతికి పెద్దవజ్రంగల ఉంగరం పెట్టుకొని వున్నది.

రామం:- [ఆదుర్దాగా] రంగనాథం-

రంగ:- క్రూరంగా- ఘోరంగా- అన్యాయంగా- ఈగదిలో హత్యచేయబడ్డది. నగలన్నీ అపహరించబడ్డాయి.

యువ:- నిజంగానండీ - మీకు బాగా తెలుసా

రంగ:— తెలుసు.

రామం:— తెలుసుగాని — బాగా తెలియదండీ

యువ:— తెలియక పోవట మేమిటండీ — అన్నిగుర్తులు చెబుతుంటే.

రంగ:— బాగా తెలుసు— నాకంటె వీడికి బాగా తెలుసు.

యువ:— ముఖ్యంగా ఆ ఉంగరంలో రాయిసంగతి ఎవరికీ తెలియదు. పోలీసులకుకూడా తెలియదు మీరామెను గుర్తించగలరటండీ?

రామం:— గుర్తించ లేమండీ! మేమామెను చూడందే?

యువ:— చూడ లేదంటా రేమండీ, యిన్నిగుర్తులు చెప్పి

రామం:— యివన్నీ మాకు ఆకురాయిడు చెప్పాడు. ఏరా! రంగనాథం ఆకురాయిడు చెప్పిలా?

రంగ:— కురవాడికంటెముందు నువ్వే చెప్పావ్. నువ్వు చెప్పని దల్లా ఒక్కటే— ఆమెను ఎవరో హత్య చేశారని.

యువ:— వస్తాసార్— పోలీసులతో మాట్లాడాలి [వెళ్ళిపోగా]

రామం:— ఆగండి

యువ:— ఏమండీ?

రామం:— మీా వేషాలేం మాదగ్గర సాగవ్.

యువ:— ఏం వేషాలు?

రామం:— మీారు మాదగ్గరనుంచి యీా భోగట్టా అంతా లాగి మమ్మల్ని ఏదో చెయ్యాలని చూస్తున్నారు.

యువ:— మిమ్మల్నా?

రామం:— వినండి— మాకీ హత్యతో ఏమీా సంబంధం లేదు.

యువ:— ఆ—

రామం:- అసలు హత్య జరిగిందనే మాకు తెలియదు. ఆమె ఎవరోకూడా మాకు తెలియదు.

యువ:- నాకు తెలుసు.

రామం:- మేము యీవూరు యివ్వాళ పొద్దున్నే వచ్చాం.

యువ:- అయితే?

రామం:- మీ తెలివితక్కువ నిరూపకత్వంతో తెలివితక్కువ దద్దమ్మ వాగుడు నాధారంచేసుకొని మామీద నింద మోపితే - ఎలా తప్పించుకోవాలో మాకు తెలుసు.

రంగ- ఎలారా?

రామం:- మీకు మాచేత అదీయిదీ వాగించి, మాదగ్గిరనుంచి అంతా తెలుసుకోవాలని చూస్తున్నారు.

రంగ:- మేము మాకు తెల్సిందికాస్తా- చెప్పనేచెప్పేశాం.

రామం:- ఏడిశావ్ - నోరుముయ్యి. మీ అనుమానాలకి ఆధారం మాదగ్గర ఏమీదొరకదు.

రామం:- కాబట్టి మాదోవన మమ్మల్ని పోనిచ్చి మీదోవన మీరుపోతే......

రంగ:- మా కుచాలా సంతోషం

యువ:- కానినాదోవననేనెలా పోను?

రామం:- కళ్ళు తెరచుకు నేపోండి.

యువ:- నన్నెంతో ప్రేమించిన నాప్రియురాలిని యీ హోటలు మొహానపెట్టి నాదోవననేపోనా?

రామం:- } ఏమంటారు!
రంగ:- }

యువ:- నా ప్రియురాలు - నాఅర్థాంగి - నాకోసంకని పెట్టుకుని వున్నకోమలి...

రంగ:- అదిసరే - అసలుసంగతి.

యువ:- యింకేంసంగితి; ప్రాణాలు పోయినతర్వాత.

రామం:- ఆమె మీకోసం వచ్చిందా?

యువ:- నాకోసం కాకపోతే మరెవరికోసం. ఆమెయింకా రాలేదని నేకాచుకు కూర్చున్నా! ఊరికే కూర్చోలేక ఆమెమీద పద్యాలుకూడా వ్రాస్తున్నా.

రామం:- మీయిద్దరూ కలిసిరాలే?

యువ:- ఆమె ఏలూరునుంచి రావాలీ, నేను గుంటూరునుంచి వస్తున్నా. ఇద్దరం కలిసి బందరు వెళ్ళాలి. ఇంకెక్కడికెళ్తాం? యిక నేవ్రాసిన పద్యాలన్నీ ఏంచెయ్యాను.

కురా:- (వస్తాడు) యివ్వాళ ఆదివారంట సార్. పోస్టాఫీసు లేదు. యిదిగోపార్సెల్. (యిచ్చివెళతాడు)

యువ:-నే వచ్చేలోగా అంతా జరిగిపోయింది. ఎంతలో ఎంత పని అయింది. (కళ్ళనీళ్ళు తిరిగాయి. కాసేపుఎవ్వరూ మాట్లాడరు) వస్తాసార్; పోలీసులతో మాట్లాడాలి (యువకుడు వెళతాడు)

రంగ:- పాపం (కళ్ళనీళ్ళు తుడుచుకుంటాడు.)

రామం:- (భుజంమీద చేతులువేసి) విచారించకురా; ఏం చేస్తాం.

రంగ:- ఏంజేస్తాం-యేమిటా నీబొంద. పెళ్ళాంపోయి వాడేడుస్తుంటే

రామం:- వాడిపెళ్ళాం సంగతి సరే - మనప్రాణాల సంగతి యేమిటి?

రంగ:- ఏం మనప్రాణాలకి?

రామం:- యీగదిలో మనండుంటే మనప్రాణాలూ పోతాయి

రంగ:- ఏం? ఆహంతకుడు మళ్ళావస్తాడంటావా?

రామం:- వాడురాడు. కాని పోలీసులు వస్తారు.

రంగ:- ఆс-

రామం:- సి. ఐ. డి.లు వచ్చి మనల్ని పట్టించుకు బోతారు - పోయి మనల్నే హంతకులని ఉరిదీస్తారు.

రంగ:- నిజంగా??

రామం:- (వినుగ్గా) నిజంగా! ఏమిటి, నిజంగా-

రంగ:- అయితే నిజంగానే

రామం:- ఆс- ఆఅమ్మాయి గుర్తులన్నీ చెప్పేశావ్. యీ ఉంగరంలో రాయిసంగతి పోలీసులకికూడా తెలియదు. అదీ మననోటితో మనమేచెప్పాం.

రంగ:- చెప్పాం.

రామం:- పోలీసులు ఆ ఉంగరంలో రాయికోసమే వెతుకుతున్నారు.

రంగ:- అవునట.

రామం:- రాయి ఎవరిదగ్గర దొరుకుతే వాళ్ళే దొంగలని వాళ్ళ ఉద్దేశ్యం.

రంగ:- అవును.

రామం:- ఇక వీడెళ్ళి పోలీసుల్ని తేవటమే తరువాయి.

రంగ:- అవునోయ్.

రామం:- తెలిసీ తెలియనివాగుడంతా వాగి, కొంపమీదకు తెచ్చావ్.

రంగ:- నిజంచెప్పేస్తే గోల వదలిపోతుందనీ...

రామం:- అదంతానేనే మాట్లాడేవాణ్ణిగా బుర్రలేకుండా నీ వెందుకూ- మధ్య?

రంగ:- బుర్ర! నాబుర్రమీద నీకు ఊరికే అలుసు.

రామం:- లేకపోతే ఏమిటి?

రంగ:- నీకంటే కోపంగాని బుర్ర ఉందికదా అని, తిని కూర్చుని యీ డిటెక్టివ్ పని తలపెట్టేవెందుకురా?

రామం:- తల పెడితేఏం?

రంగ:- ఏం ఏమిటి. నీతలకాయ నాతోచెప్పకుండా తలపెట్టి తలమీదకు తెచ్చావ్.

రామం:- అబ్బాయ్: తెచ్చాను. యిప్పుడిది మనయిద్దరి తల మీద పీఠంవేసుకూర్చుంది. దింపటం ఎట్లాగో ఆలోచించు.

రంగ:- ఏమాలోచించను

రామం:- యీ వజ్రంఎల్లా వదలించుకోవటం? యిది మన దగ్గిరఉంటే మనమీద అనుమానం మరింత హెచ్చు తుంది.

రంగ:- (ఆలోచించి అకస్మాత్తుగా) ఆ. నాకొకటితట్టిందిరా

రామం:- ఏడిశావ్; - నీకు తట్టటంకూడానా

రంగ:- నిజంగారా?

రామం:- ఏమిటది.

రంగ:- ఈ వజ్రం చిన్నదేకాబట్టి యిదినెమ్మదిగా నోట్లో

వేసుకొని మింగి నీళ్ళు తాగెయ్యి యిక ఎవ్వరూ కనుక్కోలేరు.

రామం:- నిజమేరోయ్.

రంగ:- చూశావా? నాకు బుర్రలేదన్నావ్.

రామం:- కాని వజ్రం మింగితే.....?

రంగ:- మింగూ!

రామం:- సినిమాల్లో చాలమంది వజ్రాలు మింగి చచ్చారు కాదురా?

రంగ:- చస్తే?

రామం:- మరి నేను మింగితే నాప్రాణంపోదూ.

రంగ:- పోతేపోవచ్చు.

రామం:- పోతే మళ్ళీ యెట్లారా?

రంగ:- పోతే ఆతర్వాత చూసుకొందాం. ముందు పోలీసుల నుండి తప్పించుకొందాం పట్టు

రామం:- ఆఁ-

రంగ:- పైగా యీ పోలీసులు పట్టుకుంటారు విచారణచేసి ఉరిశిక్ష వేస్తారు. వెధవప్రాణం ఎట్లాపోతేనేం?

రామం:- అంతేనంటావా? ... ... ... అంతేనంటావా? (దూరంగా వెళ్లి, ఆలోచించి) ఒరేయ్ యిట్లారా (రంగనాథం దగ్గరకు రాగా) చెయ్యిపట్టు (వజ్రంచేతిలో పెట్టి) నువ్వే నోట్లోవేసుకోరా.

రంగ:- ఆఁ-

రామం:- మంచి నీళ్ళిస్తాను. మింగెయ్యి. ప్రాణస్నేహితులం మన ప్రాణాల్లో భేదం ఏమిటి.

రంగ:- నన్నే వేసుకోమంటా?

రామం:- నీకు మాత్రిలుమింగటం కాస్త అలవాటు కాదూ అందుకని నిన్నే వేసుకోమంటున్నా. (యువకుడు హోటల్ ప్రొప్రయిటరు వస్తారు)

హో ప్రొ:- ఇవ్వాళ పొద్దున్నే కాదండి వీళ్ళొచ్చింది.

యువ:- ఎప్పుడొచ్చారో నాకు తెలియదుగానీ- ప్రొప్రైటర్ గారూ; గుర్తులన్నీ చెప్పారండి.

ప్రొ:- ఏమండీ యీవిషయం మీకేమైనా తెలుసా?

యువ:- అన్నీ తెలుసండి-మర్డర్ వీళ్ళుచేశారో-లేదో. కాని మర్డర్ చేసినవాడు వీళ్ళకు తప్పకుండా తెలిసి ఉంటాడు.

యువ:- యిందాక-ఉంగరంలో వజ్రం సంగతి ఏదోఅన్నారు కూడా.

ప్రొ:- వజ్రం వీళ్ళ దగ్గర దొరికితే మన అనుమానం నిజమే అవుతుంది.

యువ:- వజ్రంవీళ్ళదగ్గర వుందేమో వెతికిచూద్దామా?

ప్రొ:- మనకెందుకు - పోలీసులరానివ్వండి. వాళ్ళే వెతుకు తారు.

యువ:- అందాకా కాస్త కనిపెట్టిఉందాం- వజ్రం పారెయ్యకుండా.

రామం:- (నిట్టూర్చి) హూ... రంగనాథం, యిందాక వక్కపొడి అయిపోయిందా? వుందా?

రంగ:- ఉంది కావాలా. (అని వక్కపొడితోపాటు వజ్రం కూడా చేతిలో పెడ్తాడు. రామం నోట్లో వేసేసుకొంటాడు)

కురర్రీ:- (వచ్చి) పోలీసులు వచ్చారు సార్
పొప్రి:- యిక్కడికేరమ్మను (కుర్రివాడు వెళ్ళగా రంగనాథంతో) వాళ్ళు వస్తున్నారు. సంగతి సందర్భాలన్నీ మీరేచెప్పండి వాళ్ళతో - లేనిపోని గొడవ మానెత్తిన పడ్డది.
రంగ:- లేనిపోనిగొడవే మానెత్తిన పడ్డది. రామం, ఏం చేద్దాంరా.
రామం:- ఏంచేస్తాం - రానీ
రంగ:- వక్కపొడి అంతా వేసుకొన్నావా? యింకా మిగిల్చావా?
రామం:- అంతా వేసుకొన్నానే— కావాలా?
రంగ:- ఒద్దులే—
రామం:- ఇందాక నేనిచ్చింది వేసుకోలే.
రంగ:- వక్కపొడా- వేసుకొన్నా హరేరామ్! అనవసరంగా నెత్తిమీదకు తెచ్చావ్‌రా.
రామం:- యీయన ఆమెగారి యిలాకా అని తెలిస్తే యీ పాటికి ఆ దొంగను పట్టేసేవాణ్ణి.
కుర్రి:- (వచ్చి పొప్రి॥ తో) మిమ్మల్నే రమ్మంటున్నారండి
పొప్రి:- నన్నా! పద (హోటల్ ప్రొప్రైటర్ వెళతాడు)
రంగ:- ఏమండోయ్ మేము యీచోరీ సంగతి ఏమీ ఎరగమండీ.
యువ:- (విసుగ్గా) అది పోలీసులతో చెప్పండి
రంగ:- మాకువాళ్ళనుచూస్తే నేభయం. మమ్మల్ని వాళ్ళ కేందుకు అప్పజెబుతారు, కావాలంటేమీరేవెతుక్కోండి

యువ:- ఉండండి, ఇంత Tragedy లోనేనుంటే నన్ను బాధ పెడ్తారు.

రామం:- అవును - కేవలం స్వంతభార్యపోతే- అందులో యింత అకస్మాత్తుగా??

యువ:- పోయింది. నిండు ప్రాణం నన్ను నీళ్ళపాలుజేసి-ఆమె మీద విరహగీతాలు వ్రాశాను. ఇక వియోగగీతాలు వ్రాయాలి- యీచేతుల్తోనే.

రంగ:- మీరూ కవులా?

యువ:- ఆc- ఆమె కోసమే కవిత్వంనేర్చుకొన్నా.

రంగ:- అందుకనేనా-మాట మాట్లాడితే వచ్చి ప్రతిమాటకీ అర్థమడిగారు-యిందాక

యువ:- కృష్ణవేణీ సరిత్తుంగ తరంగాలలో మంగళస్నానంచేసి కనక దుర్గాదేవి దివ్యదర్శనం చేసుకొందామనుకున్నాను. అమె మనోధనాన్నంతా నేనే అపహరించాననుకొన్నా. స్త్రీ ధనాన్ని అపహరించిన గజదొంగగా నన్ను నేనే వర్ణించుకొన్నా. వజ్ర వైడూర్యాల్లాంటి విలువైన ఆమెప్రేమను. కొల్లాగొట్టాననుకున్నా. కాని యీదొంగలు.....

రంగ:- ఆ దొంగలం మేకాదండీ బాబూ.

కుర:- (వచ్చి యువకునితో) మిమ్మల్నీ రమ్మంటున్నారండీ

యువ:- నన్నా? పద (వెళతాడు)

రంగ:- ఆc- నీకడుపులో ఎల్లాఉందిరా!

రామం:- ఏం- బాగానేఉంది.

రంగ:- బాగా నేవుందీ?

రామం:- ఏం! నీకడుపులో బాగా లేదా?

రంగ:- లేకేం; బాగానేవుంది. (కాస్త దూరంగా వెళ్ళి నాలుగు వేళ్ళు చూపిస్తూ) యివి ఎన్ని వేళ్ళు రా?

రామం:- అదేమిటిరా అట్లా అడిగావ్?

రంగ:- ఏదో అడిగాను. చెప్పరాదూ? వెధవప్రశ్న లెందుకూ?

రామం:- నాలుగు వేళ్ళు.

రంగ:- ఫర్వాలేదు (కిటికీవైపు చూపిస్తూ) ఆ దూరాన ఉన్న దేమిటి?

రామం:- మేడ.

రంగ:- దాని ప్రక్కగా- దూరాన

రామం:- గాలిగోపురం.

రంగ:- యస్, దాని పై ఉన్న శిఖరాలెన్ని.?

రామం:- ఎందుకురా?

రంగ:- చెప్పకుండా ఎందుకంటావేం?

రామం:- నాలుగనుకుంటా.

రంగ:- ఆ. ఆ. సరిగా చెప్పు.

రామం:- అయిదు.

రంగ:- ఫరవాలేదు.

రామం:- ఎందుకురా యివన్నీ.

రంగ:- దూరదృష్టి ఉందో-లేదో-అని

రామం:- ఏడిశావ్ లే; కాని ఒక్క సంగతి చెప్పు. వజ్రాలు మింగితే వెంటనే ప్రాణం పోతుందా?

రంగ:- వెంటనేకాదేమోగాని కాసేపట్లో పోతుంది.

రామం:- ముందు కడుపులోనొప్పి, ఆయాసం, మతితప్పటం, యిల్లాంటివేమిరావూ?

రంగ:- అవ్వేమీ సినిమాలో చూపించలేదురా.

రామం:- వస్తే ముందు కడుపు నొప్పిరావాలి. వజ్రం అరిగి రక్తంలో ప్రివేశించిన తర్వాత మతికూడాపోవచ్చు

రంగ:- నేనూ అదేఅనుకున్నా అందుకని మనం కడుపునొప్పి సంగతి కనిపెట్టి ఉండాలి.

రామం:- మరే! అది రానంతవరకూ ఫరవాలేదు.

రంగ:- మరినువ్వు కాస్త కనిపెట్టిఉండు.

రామం:- ఓ, నీకేం ఫరవాలేదు నేకనిపెట్టి ఉంటాలే.

రంగ:-(Detective Novel ను చూపి) అన్యాయంగా యీ నవల చదివి ప్రాణాలమీదికి తెచ్చావ్ కదరా!

రామం:- అబ్బాయ్! అంతా అయిపోయింతర్వాత యిప్పుడు ఏంచేస్తామ్? యిక కాసేపు ఓపికపట్టు అంతా తేలి పోతుంది.

రంగ:- యీ వెళ్ళిన వెధవలు తిరిగి చావరే ఎంతసేపటికీ

రామం:- ఒరేయ్ నువ్వు చావులసంగతి ఎత్తకు నాకసలే భయంగాఉంది.

రంగ:- సరేలే అదీనిజమే

కుర్రి:- (వస్తాడు) దొంగలు దొరికారుటసార్

రంగ:- దొంగా?

రామం:- ఆ దొరికాడూ!

కుర్రి:- అవునుసార్. పోలీసులు పట్టుకొచ్చారు.

రంగ:- ఎల్లాదొరికాడు ?

రామం: ఎక్కడ దొరికాడూ?

కుర్రి:- ఆదేమోసార్. దొంగ ఒకడు కాదుటసార్. యిద్ద రుట. చాలా gentlemen లాగా కనిపిస్తారట- మీకు మల్లే పడుచు వాళ్ళేట. వాళ్ళదగ్గర పోయినసొమ్ము దొరికిందట. ఆరూమ్‌లో ఉన్నాయన - గుర్తు పడు తున్నాడు.

రంగ:- నువ్వు చూశావా దొంగల్ని?

రామం:- వాళ్లనీ తెచ్చారాయిక్కడికి?

కుర్రి:-ఏమోసార్ అంతాగదిలోకూర్చొని రహస్యమా ఆలో చిస్తుండిరి.

రామం:- మరియివన్నీ నీకెవడు చెప్పాడూ?

కుర్రి:- మావాళ్ళంతా అనుకుంటుండిరిసార్.

రామం:- మరి, వాళ్ళుమాట్లాడేది నువ్వు వినలా?

కుర్ర:- వినలేదుసార్ నేనిక్కడనే ఉంటినిగా.

రామం:- యిక్కడ అంటే!

కుర్రి:- మేడమీదేసార్; మెట్లదగ్గర. మిమ్మల్నెవర్నీ కిందికి పోకుండా చూడమని చెప్పి పూడ్చినారు ప్రొప్రైటర్

రామం:- ఎవర్నీ వెళ్ళనివ్వద్దని కాపలా పెట్టారా - నిన్ను?

కుర్రి:- అదేసార్ మీయిద్దర్నీ...... వస్తాసార్... అన్నీ సరిగ్గా కనుక్కొస్తా (వెళతాడు)

రామం:- వీడనేది మన్నిగురించేనా ఏమిటిరా?

రంగ:- యింకా అనుమానమా చచ్చాంరా దేముడా- తర్వాత జడ్జిమెంట్లు, ఉరిశిక్షలూ సంగతెల్లా ఉన్నా విచారణ య్యేదాకా మనయిద్దర్కీ జైలుతప్పదు.

రామం:- జైలైనా పర్వాలేదు ఎల్లానో అల్లా శిక్ష తప్పించుకోవచ్చు. మహామహా మర్డర్ కేస్‌లే కొట్టేస్తున్నారు. కాని వజ్రం మింగినప్రాణాన్ని ఎంత పెద్ద డాక్టరయినా కాపాడలేడు.

రంగ:- అవునవును

రామం:- యీమధ్య ఎవ్వరూ వజ్రాలుమింగి చావటంలేదు,

రంగ:- మరే- చాలాఖరీదైనవికదూ. ఎవరుమింగిచస్తారు?

రామం:- అందుకే యిప్పటి డాక్టర్లకు - వజ్రం మింగితే ఏం యివ్వాలో ఏం చెయ్యాలో ఏమి తెలిసి ఉండదు.

రంగ:- అయితేయిక ఖాళీయేనంటావా?

రామం:- ఆ వెధవ ఉంగరంలో రెండు వజ్రాలుంటే బాగుండేది. చెరి వకటి మింగేవాళ్ళం

రంగ:- అంత అదృష్టంకూడానా.

రామం:- నువ్వేమరీ గాబరా పడకురా; యీలోపుగా ఏదో ఒకటి చేద్దాం.

రంగ:- యింకేంచెయ్యగలం?

రామం:- మరేంలేదు. జీర్ణంకాకమునుపే పొట్ట ఆపరేషన్ చేసి వజ్రం తీసేస్తేసరి.

రంగ:- నీకేం ధైర్యంరా. యింత ప్రమాదమైన పరిస్థితుల్లో కూడా అంత తేలిగ్గా మాట్లాడ్తావ్

రామం:- లేకపోతే నీకు మల్లే యీవెధవ ప్రాణాలకోసం గాభరాపడతాననుకున్నావేమిటి.

కుర్రి:- (వచ్చి) వాళ్ళే దొంగలట సార్ జైల్లో పెట్టేశారట

రంగ:- అయితే మనం బయట పడ్డామన్నమాట.

రామం:- అన్నమాట్లే; మరిసొమ్ము సంగతి.
కుర్రి:- సొమ్మంతా దొరికిందటసార్.
రామం:- దొరికేఉంటుంది - ఆ ఉంగరంలోరాయితప్ప
కుర్రి:- ఉంగరంలోరాయీ దొరికిందటసార్.
రామం:-
రంగ:- } ఏమన్నావ్
కుర్రి:- ఉంగరంలో రాయి దొరికిందట.
రంగ:- ఏడిశావ్ సరిగ్గా కనుక్కో
కుర్రి:- లేదుసార్ దొరికిందట (యిద్దరూ తెల్లబోయారు)
ఏమిసార్! అట్లా అయిపోయారు.
రంగ:- ఏం లేదుపో
కుర్రి:- వస్తాసార్; కావాలంటే మీరు ఎక్కడకైనా వెళ్ళ
వచ్చు. (వెళ్ళాడు)
రామం:- కడుపులో భద్రంగావున్నరాయి వాళ్ళకెట్లా దొరి
కిందిరా?
రంగ:- అదేఆశ్చర్యంగావుంది.
రామం:- నీకడుపు ఆపరేషన్‌చేసి తీస్తేగాని రాదే ఆరాయి
రంగ:- నాకడుపెందుకూ ఆపరేషన్; నీకడుపే.
రామం:- నాకడుపెందుకూ; నీకడుపే.
రంగ:- నువ్వువజ్రం మింగితే నాకు ఆపరేషన్ ఎందుకూ?
రామం:- వజ్రంనువ్వు మింగావుకాబట్టి నీకు ఆపరేషన్
రంగ:- ఏడిసినట్టుంది - నువ్వేగామింగింది
రామం:- ఏడిసినట్టుంది- నువ్వేగా మింగేసింది
రంగ:- లేదురా యిందాక నేను నీకిచ్చాను.

రామం:- మింగమని నేనే నీకిచ్చాను
రంగ:- మళ్ళా తిరిగి నీకేయిచ్చా.
రామం:- లేదురా ఆఖరికి నేనే నీకిచ్చాను.
రంగ:- ఆఖరికి నేనేయిచ్చానురా, వక్కపొడితోపాటు.
రామం:- వక్కపొడితోపాటు వజ్రం యిచ్చావా?
రంగ:- ఆఁ- యిచ్చా; వక్కపొడి అడగటంలో నీఉద్దేశ్యం అదేననుకొని యిచ్చా అది నువ్వు నోట్లోవేసుకున్నా వాయె.
రామం:- నువ్వుచూశావా?
రంగ:- ఆఁ- కళ్ళారా
రామం:- అయితే నేనేమింగానా?
రంగ:- నువ్వే-నమిలి మింగావ్
రామం:- ఎంతపని చేశావురా
రంగ:- ఆఁ-
రామం:- వజ్రం నాకడుపులోనే వుందా
రంగ:- ముమ్మాటికీ
రామ:- నిజంగా నేనా
రంగ:- నీతోనే నబద్ధంఆడ్తానటారి
రామం:- అయితే నిజంగానే
రంగ:- ఓ- చాలా నిజంగా
రామం:- అయితే ఆపరేషన్ నాపొట్టకే - నాపొట్ట నిలువు నాచీల్చి వజ్రం ఎక్కడుందో భూతద్దంతో వెదికి తియ్యాల్సిందే?
రంగ:- అక్షిల్లేదు తేలిగ్గానే దొరుకుతుంది కాస్త చత్వారం

లేని డాక్టర్ని పెడితే సరి పైగా వజ్రం మెరుస్తుందిగా—
త్వరగా నే కనిపిస్తుంది.

రామం:- ఈనిండు ప్రాణాన్ని నిలువునా తీయ్యాల్సిందే.

రంగ:- ఫరవాలేదురా వెధవ ప్రాణంకోసం అంత ఖంగారు
పడ్తావెందుకూ?

రామం:- ఇంత ప్రమాదంలో అంత ధైర్యంగా మాట్లాడకురా

రంగ:- ఫరవాలేదురా, గాభరాపడకు.

రామం:- తప్పకుండా నేనే మింగాననంటావా? నీపొట్ట ఖాళీ
యేనా

రంగ:- ఆఁ- ఖాళీయే ఉన్నదే ఒకటి నువ్వు మింగావ్.
రెండు లేవుగా?

రామం:- అంత అదృష్టంకూడానా... ఒరేయ్ ...కడుపుంలో
ఏదోనొప్పిగాఉందిరా.

రంగ:- ఎక్కడ

రామం:- యీమూల

రంగ:- నిజంగా

రామం:- నిజంగావేంటి — ఎక్కువవుతోందికూడా.

రంగ:- ఒక్కసారి యిటుచూడు...(నాలుగువేళ్ళు చూపిస్తూ)
యివెన్ని?

రామం:- ఆగరా... చస్తుంటే నొప్పితో

రంగ:- ఎక్కువయి పోతుందా?

రామం:- ఏడాక్టర్నయినా పిలిపించరా.

రంగ:- పంపిస్తా... యివెన్ని

రామం:- ఎన్నోకొన్ని ...పంపించరా బాబూ

రంగ:- (కుర్రివాడు రాగా) దగ్గరలో ఒకడాక్టరును పిలుచుకురా.

కుర్రి- ఎందుకండీ

రంగ:- మావాడికి కడుపులోనొప్పివచ్చింది.

కుర్రి:- కాస్త సోడావుప్పు వేసుకోండిసార్ పోతుంది.

రంగ:- పోదు వెళ్ళుత్వరగా డాక్టర్ ... (కుర్రివాడువెళతాడు)

రామం:- రంగనాధం

రంగ:- ఎట్లావుందిరా

రామం:- నువ్వుకాస్త దూరంగానుంచో (వెళ్లి నుంచోగా చూచి) నువ్వేనా అక్కడ నుంచుంది.

రంగ:- నేనే. నన్నేగానుంచోమన్నావ్

రామం:- ఏదో కళ్లు మసకలుగా వున్నాయేరా?

రంగ:- నిజంగా.

రామం:- వజ్రం అరిగిపోలేదుగబా?

రంగ:- అప్పుడే అరిగిపోతుందా

రామం:- అరిగే ఉంటుంది. నా కజీర్ణం ఎప్పుడూ లేదు.

రంగ:- అయితే అరిగి బుర్రకి పట్టిందంటావా?

రామం:- ఏమో కళ్ళకి తెరవేసినట్టుంది.

రంగ:- అయితే ఆపరేషన్ చేసి లాభంలేదా ఏం?

రామం ఏమంటావ్

రంగ:- వజ్రం కడుపులో ఉంటేగా ఆపరేషన్ చేసి తీసేది.

రామం:- అవును

రంగ:- డాక్టరు వచ్చియికక లాభం ఏముంది

రామం:- లాభం లేదూ

రంగ:- అందులో యీ కాలపు డాక్టర్లకి వజ్రం మింగితే ఏం చెయ్యాలో కూడా తెలియదు.

రామం:- తెలియదంటావా?

రంగ:- ఆఁ- యీ రోజుల్లో వజ్రాలు మింగి చచ్చేవాళ్ళైన రుంటారు.

రామం:- ఉండరూ.

రంగ:- ఎవరుంటారు? వజ్రాలు ఊరికే వస్తాయా!

రామం:- ఎక్కడన్నా దొరికితే......

రంగ:- ఎక్కడ దొరుకుతై దొరకవ్. నువ్వు గాభరాపడక. బుర్రికివజ్రి విషం ఎల్లానో పట్టింది. కాస్సేపటికి మతి తప్పుతుంది. మతితప్పినవెంటనే కడుపునొప్పి ఎల్లాగో పోతుంది.

రామం:- తర్వాత ప్రాణమే పోతుంది.

రంగ:- ప్రాణం ఎల్లాగో పోతుంది- యివ్వాళ కాకపోతే రేపు.

రామం:-అయితే ప్రాణం పోతుంటే చూస్తూ ఊరుకోవలసిందే.

రంగ:- ఆఁ- అంతే.

రామం:- పోతే ఎట్లారా?

రంగ:- అబ్బాయ్... ఆతర్వాతసంగతి చూసుకుందాంలే.

రామం:- అరెఁ ఎవర్రా వస్తున్నది.

రంగ:- ఎవరూ?

రామం:- ఎవరోరా?

రంగ:- ఎక్కడ?

రామం:- అదేరా ఆకిటికీలో

రంగ:- ఆఁ కిటికీలోనా

రామం:- ఆఁ నల్లగా...లావుగా

రంగ:- చెప్పకురా బాబూ.

రామం:- గమ్మత్తుగా ఉన్నాడురా.

రంగ:- వద్దురా బాబూ అంటే - చెప్పకు - నాకున్న ధైర్యం కాస్తా పోవాలా ఏమిటి?

రామం:- అదిగో అడుగుల చప్పుడు

రంగ:- అడుగుల చప్పుడా? నాకేం వినిపించందే...

రామం:- నాకు వినిపిస్తున్నది. (కురర్రవాడూ ఒక అయుర్వేద ఆచార్యులవారు వస్తారు.) హోటల్ ప్రొప్రయిటర్ కూడావస్తాడు)

ప్రొ:- ఎవరికండీ కడుపులోనొప్పి.

రంగ:- మావాడికండి... [ఆచార్యులవారు రాగానే సరాసరి రామం మంచందగ్గరకు వెళ్ళివాడి చూడటం ప్రారంభిస్తాడు]

రంగ:- మావాడండీ...

ఆచా:- (ఆగమని సంజ్ఞచేస్తూ) హుష్... చాలా ప్రమాద స్థితిలో ఉన్నాడు.

రంగ:- కని పెట్టేశారండి.

ఆచా:- హుష్... వాతంలో సన్నిపాతంచేరి చేతంలోకెక్కి చేతిలో కనిపిస్తోంది.

రంగ:- నిజమేనేమో కాస్త త్వరగా మందివ్వండి

ఆచా:- జ్వరం 102° పైగానూ 104° లోపుగానూవుంటుంది.

రంగ:- వాడికి జ్వరంలేదండి.

ఆచా:- హుష్... అబ్బాయ్! దగ్గు వస్తోందా?
రంగ:- లేదండీ...-
ఆచా:- ఆయాసంగావుందా నాయనా?
రామం:- ఆయాసమూ — లేదండి.
ఆచా:- వస్తుంది యికముందర వస్తుంది, కడుపునొప్పి-
రంగ:- ఉందండీ
ఆచా:- ఉంటుంది ఫరవాలేదు. నాదగ్గర వజ్రినాభ భస్మం వుంది.
రంగ:- ఆ!
ఆచా:- వజ్రి మరకత మాణిక్యాలు, శతపుఠం వేసితీసి దాచి వుంచిన దివ్యఔషధంవుంది. అదియిస్తే యిట్టే...
రంగ:- మీారసలు సంగతి కనిపెట్టలేదట్టుంది.
ఆచా:- తొందరపడకమ్మా- నీదికాస్త పైత్యపుతత్వంలావుంది
రంగ:- వాడు వక్క వజ్రింమింగి యిలా అయ్యాడు మీారు మరకత మాణిక్యాలుగూడ యిస్తే యిక ఆశవుండదు.
ప్రా:- వజ్రిం మింగాడా?
కుర్రి:- ఎక్కడిది?
రంగ:- యిక్కడ దొరికింది, అది మాదగ్గర దొరికితే మేమే నేరంచేశాం అంటారని మింగేశాడు. అప్పటినుండి కడుపులో నొప్పి ప్రారంభంఅయింది.
ప్రా:- వక్కపొడితో పాటు వజ్రిం యిక్కడెక్కడ దొరికిందండి గోల. ఈవజ్రిం యెక్కడిదో.
ఆచా:-పరవాలేదునాయనా, వజ్రం ఎందువల్లమింగినా వచ్చిన నొప్పికి మళ్ళా వజ్రిమే పడాలి హోమ్యో సిద్ధాం

తం నిజమైతే యిదికుదిరి తీరాలి.

రంం:- కాని అల్లోపతి సిద్ధాంతం నిజం అయితే పీసుచచ్చి తీరాలి.

రామం:- ముందు మందివ్వండిరా ? మధ్యనే చస్తున్నాను.

రంగ:- అదే ఏతీరీ ప్రికారం యివ్వాలని-

ఆచా:- చూడునాయనా - వజ్రింమింగి ఎంతసేపయింది.

రామం:- ఓ అరగంటలోపు.

ఆచా:- పరవాలేదు. ఒకగ్లాసు నీళ్ళు తీసుకురా (రంగనాథం కూజాలో నీళ్ళు తీసుకురాగా తన సంచిలో నుండి ఒకసీసాతీసికొని మందు దాంటోవేసి యిస్తూ) యీ పానకం తాగునాయనా

రామం - (కాస్త తాగి) అబ్బచేదు.

రంగ:- ఛా! పానకం చేదుటా?

ఆచా:- అదే పంచతిక్త పానకం.

రంగ:- అదిచేదా?

రామం:- చేదు To the power of 5

ఆచా:- తాగు నాయనాతాగు (తాగించి) అబ్బాయ్ కాస్త ఉప్పు పట్టుకురా

కురి:- ఉప్పా?

ఆచా:- ఉప్పు-బాగా మరికాస్త పట్టుకురా (అని దోసిడిపట్టి చూపిస్తాడు)

రామం:- కడుపులో.....తిప్పుతోంది

ఆచా:- తిప్పాలి, తిప్పాలి యిరుక్కున్న వజ్రం పడాలంటే బాగా తిప్పాలి.

పాత్రి:- ఆగదిలోకి పోదాంపదండి. (రంగనాథంతో) మీరు కాస్త పట్టుకోండి. (యిద్దరం సహాయంచేస్తూ రామాన్ని అవతలగదిలోకి తీసుకువెళతారు) రెండవవైపు నుంచి కుర్రాడు ఉప్పుతీసు కొస్తాడు అది ఆచార్యులవారు కూజాలో కలుపుతాడు. (గదిలోంచి రంగనాథంవచ్చి)

రంగ:- వమనం అయిందండీ.

ఆచా:- వజ్రం వచ్చిందా?

రంగ:- రాలా-...

ఆచా:- ఈకూజానీళ్ళు తాగ్రమనండి

రంగ:- యివన్నీనా? (తీసికెళ్ళి యిచ్చివస్తాడు)

ఆచా:- తాగాడా?

రంగ:- ఆ!

ఆచా:- వజ్రం వచ్చిందా?

రంగ:- లేదు (కుర్రాడు మరోబిందెడు నీళ్ళతోవస్తాడు)

ఆచా:- యివికూడా యిచ్చెయ్యండి

రంగ:- యిదేమిటి? చంప దలుచుకున్నారాఏం?

ఆచా:- ఆభయం మీకేమి అక్కర్లే

రంగ-: ఆభయం మాకు కాకపోతే...?

ఆచా:- చూడండి పైత్యకోశంలో యిరుక్కున్న వజ్రం విడివడాలంటే యిదేకాదు. మరోబిందెడుకూడా యివ్వాలి

రంగ:- ఆఁ-... (రంగనాథం ఒకబిందె తీసుకొని వెళ్ళగా

కుర్రివాడు మరో బిండెతీసుకెళ్తాడు. ఆచార్యుల వారు కింద ఏదోకనబడగా అదితీస్తాడు.)

రంగ:- (తిరిగి వచ్చి)

ఆచా:- ఏం వజ్రింవచ్చిందా?

రంగ:- రాలేదు.

ఆచా:- ఆవజ్రిం ఎంతది?

రంగ:- చాలాచిన్నదండి.

ఆచా:- యింత వుంటుందా (అని చేతిలోది చూపుతాడు)

రంగ:- యింతవుంటుందా ఏమిటి? ఇదే-వాడి కడుపులోది యిక్కడికి ఎట్లావచ్చింది?

ఆచా:- అయితే ఆయన మింగలేదన్నమాట వక్కపొడితో పాటు వేసుకున్నారన్నారుకదూ? అది కొరకపడక వుమ్మేసివుంటాడు.

రంగ:- మరి కడుపులోనొప్పి- యీ గల్లంతంతా ఏమిటి?

ఆచా:- అదంతా మింగాననుకున్న గాభరాలో వచ్చిందయి వుండాలి.

రంగ:- అంతేగాని నిజమైంది కాదంటారా?

ఆచా:- కాదనే అనాలి.

రంగ:- మరి యిందాకటినుంచి- పైత్యకోశంలో చిక్కిందని అన్నమాటలు అన్ని దండుగ అన్నమాట.

ఆచా:- దండుగఅనే అనాలి.

రంగ:- మరి లవణ మిశ్రిత పాత్రాదిక జనపాన జనితచర్దులు.

ఆచా:- అనవసరమనే అనాలి కాని యీ వజ్రిం మీరుపట్టు కెళ్ళి ఆనీళ్ళలో పడెయ్యండి చూడకుండా తర్వాత

శాంతితో పాటువచ్చిందని చూపించండి.
రంగ:— ఏంఖంగారు చేశావురా రామం (లోపలికి వెళతాడు వజ్రంతీసుకుని)
ఆచా:— ఆఁ— (రామాన్ని ప్రొప్రైటర్, రంగనాథం తీసుకు వచ్చి కూర్చోపెడతారు. రామం కళ్ళు గుంటలు పడి పోయాయి.)
రంగ:— వజ్రం వచ్చేసిందండి.
ప్రొ:— పోయిన సొమ్మంతా దొరికిందండి?
యువ:— దొరికింది వుంగరంలో రాయితప్ప.
ప్రొ:— ఇదేమో చూడండి (వజ్రం యిస్తాడు)
యు:— (అది తీసుకుని)యిదే యిక్కడికెట్లావచ్చింది
రంగ:— మాఖర్మంచాలక వచ్చింది (ఆ వజ్రంవంకే చూస్తూ యువకుడు కుర్చీలో, కూర్చొని తనభావాల్లో మునిగి పోతాడు)
రామం:— కడుపులో ఇకఏమీ లేనట్టేనా
ఆచా:— ఏమీ వుండదు ఉండటానికివీలులేదు.
రామం:— ఆవగింజంత ఏమున్నా అరిగిందేమో చూశారా.
ఆచా:— ఏమీ అరగలేదు. కాస్తాకూస్తా అరిగినా, అరిగిన వజ్రంవంటుబట్టి శరీరం వజ్రకాయం అవుతుంది, యీ డోసు వకసారి తీసుకోండి.
రామం:— వద్దుబాబూ అది మళ్ళీవద్దు.
రంగ:— అదివద్దుగాని మళ్ళీ యిటువంటి పనులు చేయకుండా వకతిక్త కషాయం వకడోసు యివ్వండి.

ఆచా- అల్లాగే మరి నాకు సెలవా

రామం:- ఆ. ఆ. యీ 10 రూ॥ లూ తీసుకోండి సెలవు

ఆచా:- భగవదార్పణం సెలవు.

ప్రొ:- పదండి పోదాం యింకెందుకూ.

రంగ:- ఇంకెందుకూ పదండి. మేమూ వెళతాము లేరా రామం. సామాను సర్దు.

రామం:- ఊ వెళదామా

రంగ:- ఆ లేకపోతే యింకా యిక్కడేవుందామా. పదపద తినికూర్చోక అనవసరంగా హైరాన పెట్టావ్ ప్రొప్రైటర్ గారూ, మా బిల్ తయారు చెయ్యండి బాబూ.

ప్రొ:- అల్లాగే రండి తయారు చేసి వుంచుతాను. (యువకునితో) ఏమండోయ్ వస్తారా మేం వెళుతున్నాం.

యువ:- (స్మృతిలోకివచ్చి) Exuse me ఏమండీ వియోగంలో విరహంరావచ్చా.

రంగ:- యోగం బాగుండకపోతే ఏదైనారావచ్చు. (అందరూ వెళతారు. రామం రంగనాథం సామాను సర్దుకుంటుండగా.....)

—: తెర :—



అచ్చయిన యితర రచనలు:—

1. తెలుగుకోపం.

బంగారు సంకెళ్ళు

(స్త్రీపాత్రిలులేని రెండు నాటికలు

2. శాంతిమయి.

త్వరలో అచ్చుకానున్నవి:—

1. నాబాబు

(నాటకం.)

2. గుడ్డిలోకం

(నాటకం.)

3. పెళ్ళి చూపులు

విధినశం.

(నాటికలు)

వలయువారు:—

డాక్టర్. కె. గంగాధరరావు,

బాపట్ల.